# ఆమె మనోహర సొగసుకు రహస్యం

INTERPUB/GCS/1 TL



## సింథాల్ యందలి జి-11 హెక్సాక్లోరోఫిన్

మనోహర సొగసు, నిష్కళంకమైన చర్మ సౌందర్యం-పరిశుభ్రమైన మనోభావం-ఆత్మ విశ్వాసం, మీ సమీపమున వుండగోరే అభిలాష.




సింథాల్ యందు గల జి.11 (హెక్సాక్లోరోఫీన్) మచ్చలను నిరోధించును. శరీర దుర్గంధమును తొలగించును. మిమ్ములను రోజల్లా హాయిగొలిపే ప్రకాశమానంగా ఉంచును.

(మరీ రూఢియైన నమ్మకతో-రోజల్లా హాయిగొలిపే పరిశుభ్రంగా నుండుటకు జి.11 (హెక్సాక్లోరోఫీన్) గల సింథాల్ సబ్బును మరియు టాయిలెట్ పౌడర్‌ను వాడండి.

జి-11, ఎల్. జివౌడా ఎట్. సీ. ఎస్. ఎ. వారి ట్రేడ్ మార్కు.



MEMBERS

JYOTI HAS BEEN MAKING HISTORY FOR THE PAST THREE YEARS AND A HALF. THE FIGURES SPEAK FOR THE FACTS.

1964 Jan - June 9,441

1964 July - Dec 12,813

1965 Jan - June 15,620

1965 July - Dec 18,971

1966 Jan - June 20,323

# తొలిమాట

వర్ధిష్ణు రచయితలు "విహారి - శాలివాహన" నవల "సెలయేటి గలగల" ఈ సంచికలో సీరియల్‌గా ప్రారంభమవుతున్నది (56వ పేజీ)

* * *

అవినీతి భారీ వ్యాపారంగా సాగిపోతున్న సంగతి అందరికీ తెలిసిందే కాని అంతిమ విజయం అన్నివేళల దానిదే కానక్కరలేదు ఉన్నట్టుండి ఒక్కొక్కచోట ఒక్కొక్క విధంగా అది బద్దలవుతూ వుంటుంది (26వ పేజీ)

* * *

సుప్రసిద్ధ రచయితల విశిష్ట రచనలతో 'జ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక పండుగకు కొన్ని రోజులు ముందుగానే వెలువడుతున్నది 'జ్యోతి' పాఠక మహాశయులకు ప్రత్యేక సంచిక ఆకర్షవంతం కాగలదని నమ్ముతున్నాము




సుచిత్ర మాసపత్రిక

బకింగ్‌హామ్ పేట పోస్టు

విజయవాడ-2.

విడిప్రతి వెల

75 పైసలు

ఏడాది చందా

9 రూపాయలు

సంపుటి 4

నవంబర్ 1966

సంచిక 11

మేనేజింగ్ ఎడిటర్

వి. వి. రాఘవయ్య




ముఖచిత్రం

రవీంద్ర ఆర్టు ప్రొడక్షన్స్‌వారి

"డాక్టర్ ఆనంద్"లో దృశ్యం






అక్టోబరు సంచికలో "పాపం! రామనాథం", "తొలకరి" కథలు చాలా బాగా ఆకర్షించాయి. శ్రీ కాశీనాథుని రామచంద్రరావుగారు వ్రాసిన "తొలకరి" చాలా సహజంగా వుంది. వాస్తవంగా కొన్ని కొన్ని కుటుంబాలలో జరిగే విధంగా వ్రాశారు. రచయితకు, మీకు నా అభినందనలు.

టి. ఉపేంద్రనాథ్,
నాగార్జున సాగర్.

మీ ఆధ్వర్యంలో క్రొత్తగా డిటెక్టివ్ కథల పత్రిక వెలువడుతుందని తెలిసి ఎంతయు సంతసించితిని. కేవలం పెద్ద రచయితలకే కాక, అభివృద్ధిలోనికి రాబోవు యువ రచయితల్ని కూడా పరిచయం చేసి, ప్రోత్సహించి, ఉత్తమమైన కథల్ని ఎన్నుకొని పత్రికను ఆకర్షణీయంగా రూపొందించుటకు కృషి సల్పెదరని ఆశిస్తున్నాను.

ఎస్. సత్యనారాయణ
ఖర్గపూర్.

ఈనెల నన్ను అమితంగా ఆకర్షించినది కాశీనాథుని రామచంద్రరావుగారి "తొలకరి". కాని, పేకాటలో సర్వస్వము ఉందనుకొన్న రాజారావులో హఠాత్తుగా అంతమార్పు తేవటంలో రచయితగారి ఉద్దేశ్యం బోధపడలేదు. అక్కినేని నాగేశ్వరరావుతో ప్రత్యేక గోష్ఠి చాలా బాగుంది.

తురుమళ్ళ మాధవరావు,
బొబ్బిలి.

స్వామి చిత్రానంద వ్రాసిన "కీ. శే. కావ్యశ్రీ" కథను వారు కీ. శే. గురుదత్ తీసిన "ప్యాసా" సినిమా వచ్చి చాలా రోజులయిందికదా, ఇంకా ఎవరికి గుర్తుంటుంది; అయినా గురుదత్ కూడా చనిపోయాడుకదా అన్న ధైర్యంతో వ్రాసినట్టుంది.

సేనాపతి, నాగపూరు.

అక్టోబర్ నెల "జ్యోతి" సంచికలోని మీ యొక్క ప్రకటన మాకు మిక్కిలి ఆనందాన్ని కలిగించినది. నేడు తెలుగులో డిటెక్టివ్ కథా సాహిత్యం మిక్కిలి అభివృద్ధి గాంచుచున్న ఈ తరుణంలో మీ సంస్థనుంచి మరియొక మకుటాయమానమైన క్రొత్త పత్రిక వెలువడుచుండుట మిక్కిలి హర్షదాయకం. "పత్తేదారు" మాలాటి డిటెక్టివ్ సాహిత్యాభిమానుల అభిమానాన్ని చూరగొని, మీ ఈ సాహస సాహితీయాత్రను విజయవంతం చేయగలదని భావిస్తున్నాము.

సంగన ఆర్. ప్రతాపరెడ్డి,
పి. హరనాధ్,
తుంగభద్రా డామ్ కాలనీ.

ఈ నెల జ్యోతి నన్నమితంగా ఆకర్షించింది. సంఘంలో సంభవమైన యథార్థ సంఘటనలను శ్రీ స్వామి చిత్రానంద గారు తమ "కీ॥ శే॥ కావ్యశ్రీ"లో చూపించారు....తెలియని చిన్న చిన్న కారణాల వల్ల భార్యాభర్తల మధ్య....అర్థంలేని వైమనస్యం ఎందుకు సంభవిస్తుందో శ్రీ కాశీనాధుని రామచంద్రరావుగారు తమ 'తొలకరి'లో చూపారు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి పెద్దకథ "మారిన జీవితం" అంతం అనుకున్నట్లే అయ్యింది. ఎం. వెంకటేశ్వరరావు గారి 'పాపం రామనాథం' కూడా ఒక మోస్తరుగా వుంది. ముఖ్యంగా నా అభిమాన నటుడు నటసమ్రాట్ అక్కినేని నాగేశ్వరరావుతో ప్రత్యేక గోష్ఠి జరిపి తద్వారా ఆయన కళా మతల్లికి తమ శక్తివంచన లేకుండా చేద్దామనుకొన్న సేవను ('చక్రవర్తి చిత్ర' ద్వారా). ఆయన ఆశయాలను, ఆయన కలలను, భూమికలను సహృదయంతో పాఠకలోకానికి తెలియ జేసినందుకు మీకు నా హృదయ పూర్వక ధన్యవాదాలు. దీపావళి జ్యోతి జ్యోతిలా దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వెలువడుతోందను కొంటాను.

ముక్కామల నటరాజ్,
ఖమ్మం.

మీపత్రికలో ప్రత్యేకంగా కాలేజి విద్యార్థుల కథలు చాలా బాగుంటున్నాయి. అక్టోబరు సంచికలో రాజకీయ వాతావరణం చాలా బాగున్నది. ఉన్నది ఉన్నట్లు వ్రాయుమన్నారు. మంచి కథలు వేసి చదువరులకు అందించుచున్నందుకు మీకు నా ధన్యవాదాలు. త్వరలో డిటెక్టివు పత్రిక మీ సంస్థనుంచి వస్తున్నందుకు చాలా సంతోషము.

ఎస్. శారద,
తెనాలి.

అక్టోబరు సంచికలో ప్రచురితమైన కథల్లో "కీ. శే. కావ్యశ్రీ" చాలా హాస్య ధోరణిలో చిత్రీకరించబడినది. "పాతా హంషాక్", "అమరుడు", "ఆప్తమిత్రుడు" కూడా చాలా బావున్నాయి. ప్రతి నెలా మంచి మంచి కథలను ఎన్నికచేసి బహుమతులిస్తూ విద్యార్థులలో రచనాశక్తిని పెంపొందింప చేయుచున్న "జ్యోతి"కి నా వందనములు.

జువ్వాల నరసింహారావు,
పాలకొల్లు.

బహుమతి పొందిన కథానికల్లో "ఆప్తమిత్రుడు" నాకు చాలా నచ్చింది. ఇతర ఆడపిల్లలను ఎగతాళి చేస్తూ తన చెల్లిని ఎవరో గోల చేశారనగానే వాళ్ళకు అక్కచెల్లెళ్ళు లేరా అని. దంబాలు పలికాడు సత్యం మహాశయుడు. కథానిక రాసినది రచయిత అయినా పక్షపాతం లేకుండా "రోమియో" అబ్బాయిలకు కొంచెం బుద్ధి వచ్చేటట్టు రాశారు. రచయితకు 'జ్యోతి'ద్వారా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

కుమారి ఎన్. సుగుణ,
పిడుగురాళ్ళ.




నాలుగైదు నెలలనుంచి ఆంధ్రప్రదేశ్ రాజకీయాలపై ఆజ్యంపోసి రాజ్యం చేసిన ఒక సమస్య ఇప్పుడు చప్పగా చల్లారిపోయింది. దాన్ని ఈనాడు తల్చుకునేవాడే లేడు.

నిజానికి, అదొక సమస్య కావలసింది కాదు. ఉట్టి పుణ్యానికి కోతిపుండు కాస్తా బ్రహ్మరాక్షసి అయింది. ప్రదేశ్ కాంగ్రెస్‌వారి ఎలకన్ కమిటీలో పదకొండవ స్థానానికి ఖాళీ ఏర్పడితే దానికి ఎవరిని ఎన్నుకోవా లనేది ఏమంత కొంపలు మునిగే సమస్య? దాని సంగతి ఎవరికి పట్టింది? ఎవరు ఎన్నికైతే ఎవరికేం ఒరిగింది? దానివల్ల రాష్ట్రానికి ఉక్కు ఫ్యాక్టరీ వచ్చేస్తుందా? నాగార్జున సాగర్ అమాంతం పూర్తి అయిపోతుందా? రాష్ట్ర పరిపాలన బాగుపడుతుందా? సమర్థమైన నాయకత్వం లభిస్తుందా? ధరలు తగ్గిపోతాయా? జీతాలు పెరుగుతాయా? బియ్యం సజావుగా, సమృద్ధిగా దొరుకుతాయా? వియత్నాం యుద్ధం ఆగిపోతుందా? పాకిస్తాన్‌వాడు కాశ్మీరు అక్కర్లేదంటాడా? చైనావాడు రాజీకొస్తాడా?

మరి, ఎందుకింత పెద్ద సమస్య అయింది ఈ ఎలకన్ కమిటీ వ్యవహారం? సంజీవరెడ్డిగారికి, బ్రహ్మానందరెడ్డిగారికి పడకపోతే మధ్యలో రాష్ట్రప్రజల కేమిటి దుగ్ధ?

ఏమోగాని, మొత్తానికి చాలా ఉత్కంఠ కలిగించింది. ఇంగ్లండులోనో, ఆస్ట్రేలియాలోనో టెస్టుమ్యాచ్ జరుగుతుంటే క్రికెట్ అభిమానులు-పనులన్నీ మానుకుని రేడియోల దగ్గిర గుమిగూడరూ? పేపర్లకోసం ఎదురుచూడరూ? అదిగో- సరిగా అలాంటి తహతహే ఈ ఎన్నిక వ్యవహారం కలిగించింది. ఎవరు గెలుస్తారు? అయోధ్యవారా? సయోధ్యవారా? హార్స్ రేసులంత హడావిడి పుట్టింది. కొందరు పందాలు కూడా వేశారు. సెప్టెంబరులో ఎన్నిక తేదీ దగ్గిర పడుతున్నకొద్దీ ఎవరి నోటవిన్నా ఈ మాటే, దీని చర్చే! దీనికి కొంత ప్రోద్బలం దిన పత్రికలు కూడా ఇచ్చాయి. మేము గెలుస్తామంటే మేము గెలుస్తామని; ఫలానా జిల్లాలో మా బలం ఇంత వుందంటే మా కిన్ని వోట్లు పడతాయని; అవతలివాళ్ళు ఫలానా అక్రమాలు చేస్తున్నారంటే ఇవతలివాళ్ళు ఫలానా వాళ్ళని బెదిరిస్తున్నారని ఓః ఎన్ని ప్రకటనలు! వాటికోసం పత్రికల కెంతగా గిరాకీ పెరిగిపోయింది!

చివరికి మేము కిందటి సంచికలో కొంచెం జాగ్రత్తగానే ఊహించినట్టు ఒక వర్గానికి మొహం కందిపోయింది. ఆ వర్గం సయోధ్య వర్గం. అది సయోధ్య వర్గం కావడంతో రెండవదానికి

సహజంగానే అయోధ్య వర్గమని పేరు వచ్చేసింది. "అయోధ్య" అంటే జయింపరానిది. బ్రహ్మానందరెడ్డిగారి వర్గం ప్రస్తుతానికిఅయోధ్య వర్గమే అయింది. ఎలక్షన్ కమిటీలో పదకొండవ స్థానానికి కృష్ణాజిల్లా రాజకీయాలలో కాకలు తీరిన కాకాని వెంకటరత్నంగారు ఎన్నికయ్యారు. ఆయనతో పోటీ చేసిన చింతలపాటివారు చింతా క్రాంతులయ్యారు.

గెలిచిన వర్గం గెలుపుని, ఓడిన వర్గం ఓటమిని వీలైనంత హుందాగానే స్వీకరించాయని చెప్పాలి. పెద్దగా ఒకరినొకరు నిందించుకుంటూ పత్రికలకి ఆట్టేపని కల్పించలేదు. సయోధ్య వర్గం మాత్రం సంజీవరెడ్డిగారు మొదట అంత ఆర్భాటం చేసి, చివరి చివరికిజావ కారిపోయారని, సయోధ్య సయోధ్య అంటూ సందిగ్ధ మనస్సుతో వ్యవహరించి మొత్తం వ్యవహారాన్ని దగ్ధం చేశారని ప్రకటనలుచేశారు. ఆయన గట్టిగా సై అంటే సై అని నిలబడి వుంటే తమ వర్గమే గెలిచేదని, చివరి కాయనహైదరాబాద్‌లో కూడా ఉండకుండా ఢిల్లీ పోవడం తమ ఓటమిని పూర్తిచేసిందని వాపోయారు.

ఇటు అయోధ్య వర్గం కూడా మరీ డాన్సులూ అవీ చెయ్యలేదు. గెలుపోటముల మధ్య మరీ పెద్ద తేడాలేకపోవడం వారికి కొంత హెచ్చరికగా పనిచేసి వుంటుంది. అంతేకాదు. ఎలక్షన్ కమిటీలో బలా బలాలు 8--5 నిష్పత్తిలో వున్నాయి. ఎన్నికలకు ఏ అభ్యర్థులను సిఫార్సు చేసినా చివరికి కేంద్రంలో ఎన్నికల సంఘం చేతికి ఆ జాబితా వెళ్ళవలసిందే. అక్కడ అది ఎన్ని మార్పులకి, చేర్పులకి గురి కాబోతోందో ఎవరికి తెలుసు? ఇదికూడా అయోధ్య వర్గం హర్షానికి బ్రేకులు వేసి వుండవచ్చు.

* * *

ఏమైతేనేం, ఆ హడావిడి కాస్తా అయిపోయింది. ఇప్పుడు కొత్త హడావిడి ప్రారంభమైంది. అసెంబ్లీలో ఉన్నవి 287 స్థానాలు. వాటికి 1400 పై చిలుకు దరఖాస్తులు కాంగ్రెసు అభ్యర్థిత్వాల కోసం వచ్చాయి. అలాగే లోక్ సభకి ఆంధ్రప్రదేశ్‌కి వున్నవి 40 స్థానాలు. వాటికి 180 దరఖాస్తులు వచ్చాయి. అంటే, ఉన్న స్థానాలకి నాలుగైదు రెట్లు చొప్పున దరఖాస్తులు వచ్చాయన్న మాట. కాంగ్రెసుకి ఇదీ ఒకందుకు మంచిదే. దరఖాస్తు ఫీజు పేరిట బోలెడు ధనం పోగైంది. ఫీజు కట్టగలిగిన ప్రతి కాంగ్రెసువాది టిక్కెట్టు కోసం అప్లయి చేశాడు. దాదాపు లాటరీ టిక్కెట్ల కోసం ఎగబడినట్టుగా ఎగబడ్డారు. వీరిలో ఎవరి అదృష్టం ఎలా వుంటుందో త్వరలోనే నిర్ణయమవుతుంది. ఆ తర్వాత వుంటుంది అసలు ముచ్చట. టిక్కెట్టు రానివారు వచ్చినవారికి వ్యతిరేకంగా పనిచేయడం జరిగినా ఆశ్చర్యం లేదు.

* * *

జనరల్ ఎన్నికలకి ఇంకొక నాలుగు నెలల వ్యవధి ఉంది. జనవరి నాటికి ఎన్నికల జ్వరం ప్రారంభమవుతుంది.

అప్పటికి దాదాపుగా ఎన్నికల సర్దుబాట్లు అవీ పూర్తవుతాయి. కాంగ్రెసును గద్దె దింపడానికి ఈసారి ప్రతిపక్షాలు కంకణం కట్టుకున్నాయి. దీనికోసం కేరళలో ఏడు పార్టీలు కలిశాయి. ఇలాగే మిగతా రాష్ట్రాలలో కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి.

జనవరి, ఫిబ్రవరి నెలలు — మంచి చలిరోజులు. అయినా రాత్రిళ్ళు కూడా దుప్పట్లు కప్పుకోనక్కరలేదు. ఈసారి ఎన్నికల వేడి మే, జూన్ నెలల్ని తలపించే విధంగా ఉండబోతోంది.

ఇప్పటికే దేశం అట్టుడికినట్టు ఉడికిపోతోంది. 1966వ సంవత్సరం ఇండియా చరిత్రలో బంద్‌లు, హర్తాళ్లు, సమ్మెలు, నిరశన దీక్షలు, నిరసన ప్రదర్శనలు, దౌర్జన్య చర్యలు, రైలు ప్రమాదాలు, పోలీసు కాల్పుల సంవత్సరంగా నిలిచిపోతుంది. పరాభవ నామ సంవత్సరం అన్ని విధాలా కాంగ్రెసు ప్రభుత్వాలకు పరాభవమే తెచ్చిపెట్టింది.

ధరలు మండిపోతున్నాయి. ఆమంటలకి సామాన్య ప్రజల జీవితాలు అంటుకుంటున్నాయి. మనిషి బతకటానికి కావలసిన బియ్యం దగ్గిర్నించి ప్రతిదీ కరువైపోతోంది. ఎవర్ని చూసినా అసంతృప్తే. ఎవర్ని కదిపినా ఏదో ఒక ఫిర్యాదే. పంథొమ్మిదేళ్ళపాటు పరిపాలన చేసి కాంగ్రెసు చివరికి దేశాన్ని ఏ స్థితికి తీసుకువచ్చింది? అన్నవిమర్శే. అంకెలలో చూసుకుంటే ఇంతగా అభివృద్ధి చెందిన దేశం మరొకటి లేదనిపిస్తుంది. జాతీయాదాయం ఇంత పెరిగింది, ఉక్కు ఉత్పత్తి అంత పెరిగింది; ఆఖరికి ఆహారధాన్యాల ఉత్పత్తి కూడా రెండు రెట్లు పెరిగింది. అని నోరూరే విధంగా అంకెలుమాత్రం చూపించవచ్చు. కాని, ఇంత అభివృద్ధీ ఏమైపోయిందో తెలియదు. సామాన్య మానవుడి దగ్గరికి వచ్చేసరికి హళ్ళికి హళ్ళి, సున్నకు సున్న. సంపన్న వర్గాలు మరీ సంపన్నమైపోతున్నాయి. సామాన్య ప్రజలు మరీ దిగజారిపోతున్నారు. అదే విచిత్రం.

ఇదంతా ప్రజల్లో ఎంత తీవ్రమైన అసంతృప్తి, అసహనం, ఆగ్రహం కలిగిస్తున్నదో వేరే చెప్పనక్కర్లేదు. ఈ అసంతృప్తి, అసహనం, ఆగ్రహం ఎన్నికలలో ప్రతిబింబించబోతున్నాయా అనేదే ప్రశ్న. ప్రజలు ఈసారి ఎలా ఓటు చేస్తారు? కాంగ్రెసుకు వ్యతిరేకంగానా? ప్రతిపక్షాలకు అనుకూలంగానా?

నిజానికి అలా జరగవలసిందే. వుయ్ మీన్—అలా జరగడం సహజమే. కాని, అలా జరుగుతుందా అని? అందుకు వీలుందా అని?

ప్రజలు కాంగ్రెసును కాదని ఏప్రతిపక్షానికి ఓటు చేస్తారు?

కాంగ్రెసును త్రోసి రాజని అధికారానికి రాగలిగిన దమ్ము ఏ ఒక్క ప్రతిపక్షానికి లేదు. కమ్యూనిస్టులు రెండుగా చీలిపోయారు. ఎన్నికలు సమీపిస్తున్నప్పటికీ వారి పరస్పర విద్వేషాలేమీ తగ్గలేదు. ఇది ఇలాగే కొనసాగుతుందో, లేక చివరికి ఏమైనా

ఎన్నికల సర్దుబాట్లు జరుగుతాయో తెలియదు. ఇకమిగతా ప్రతిపక్షాలైన స్వతంత్ర పార్టీ, జనసంఘ్. పి.ఎస్.పి., ఎస్.ఎస్.పి., హిందూ మహాసభ, ఆర్.ఎస్.పి., డి.ఎమ్.కె. మొదలైనవి — కొన్ని కొన్ని రాష్ట్రాలలో బలంగా వున్నాయి. అదేవిధంగా ఒరిస్సాలో జనకాంగ్రెస్, బెంగాల్‌లో బంగ్లా కాంగ్రెసు వంటివి వున్నాయి. ఇవి అన్నీ మూకుమ్మడిగా కలిస్తే తప్ప కాంగ్రెసును ఎదుర్కోవడం సాధ్యంకాదు. ఇలా జరుగుతుందా అనేది చూడవలసిన విషయం.

కేంద్రంలో కాంగ్రెసు మెజారిటీతో రాగల దనడానికి సందేహం లేదు. పోతే రాష్ట్రాలలో కూడా కాంగ్రెసు ఎన్ని అంతర్విభేదాలతో ఎంతగా బలహీన పడినా ఎక్కువచోట్ల, మెజారిటీని సులభంగానే సంపాదించుకోవచ్చు. కొన్ని చోట్ల మటుకు నామమాత్రపు మెజారిటీ సంపాదించుకోవచ్చు.

పూర్వపు మూడు జనరల్ ఎన్నికలకి ఇప్పటికి దేశంలో పెద్ద మార్పులే వచ్చాయి. ఆర్థికంగా దేశం ఇప్పుడున్నంత దుస్థితిలో ఇదివర కెన్నడు లేదు. అన్ని వర్గాల ప్రజలు ఏదో ఒక విధమైన అసంతృప్తితో, ఇబ్బందితో కుంగిపోతున్నారు. సంపన్న వర్గాలు కాంగ్రెసును ఎంత విమర్శించినా, కాంగ్రెసు ప్రభుత్వాలు తమపై పన్నుల భారాన్ని ఎంత ఎక్కువగా పెంచినా వారికి మరొక మార్గం లేనందున, చివరికి కాంగ్రెసునే బలపరుస్తారని భావించవచ్చు. మధ్యతరగతి ప్రజలు కూడా ఎంత అసంతృప్తులైవున్నా. కొంతవరకు కాంగ్రెసునే బలపరచవచ్చు. పోతే, తక్కువ ఆదాయాల వర్గాలవారి చేతుల్లోనే బ్యాలన్సు వుంది. వీరు, మధ్యతరగతిలో ఒక భాగం వామపక్షాలను బలపరచడానికి నిశ్చయిస్తే కాంగ్రెసు పని క్లిష్టంకాక తప్పదు.

కాంగ్రెసు బలహీనత మరొక ముఖ్య విషయంలో వెల్లడవుతున్నది. నెహ్రూ అనంతరం దానికి బలమైన నాయకత్వం, అన్ని వర్గాలను అయస్కాంతంవలె ఆకర్షించగల శక్తి మృగ్యమై పోయింది. స్వ రా ష్ట్రాభిమానాలు, స్థానికమైన పలుకుబడి గల రెండవ తరం నాయకులు తప్ప, మొత్తం దేశమంతటిని, అన్ని అభిప్రాయాల వారిని కూడ గట్టుకుని తమ మాట చెల్లించుకోగల నాయకులు దానికి కరువై పోయారు. ఇది ఈసారి ఎన్నికలలో బాగా పని చేస్తుందనడానికి సందేహం లేదు.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను చూస్తేనే దాని బలహీనత ఎక్కడుందో తెలిసిపోతున్నది. పాత వాగ్దానాలకు, కొత్తవాటికి తేడా ఏమీలేదు. ఇదివరకు నెరవేర్చలేక పోయిన వాటినే తిరిగి ఉద్ఘాటిస్తున్న ఈ ప్రణాళిక ఎవరినీ సంతృప్తి పరచలేదు. బ్యాంకింగ్ వ్యాపారాన్ని జాతీయం చేయడం వంటి సమస్యపైకూడా తన అభిప్రాయ మేదో తానే స్పష్టంగా నిర్వచించలేక పోయింది. ఏదో మసిపూసి

మారేడుకాయ చేయడానికి ప్రయత్నిం చింది, ఇంకొక పదేళ్ళలో అందరికి తిండి, గుడ్డ వంటి అవసరాలను తీర్చ గలనని వాగ్దానం చేసింది. ఒకపక్క జనాభా పెరిగిపోతూ, దానికి తగిన నిష్పత్తిలో ప్రాథమికావసర వస్తువుల ఉత్పత్తి పెరగకుండా నిలబడిపోయి నప్పుడు, ఈవాగ్దానాన్ని కాంగ్రెసుకాదు, మరే పార్టీఅయినా ఎలా నెరవేర్చగలదో అర్థంకావడంలేదు. కేవలం ప్రజలను మభ్యపుచ్చడానికే ఈ స్లోగన్‌ను దేశం మీదికి కాంగ్రెసు వదిలిందని ఎవరికైనా తోచక మానదు పైగా, ఈనాడు అనేక విధాలుగా కష్టనిష్ఠూరాలకుగురిఅవుతున్న ప్రజలకు మరొక పదేళ్ళలో అరచేతిలో వైకుంఠం చూపించగలమని ఎంత ఆశపెట్టినా ప్రయోజనం వుంటుందా అని అనుమానం.

మిగతా పార్టీల ప్రణాళికలైనా ఇలాగే వున్నాయి. ప్రస్తుత సమస్య లను ఏ విధంగా పరిష్కరించవలసి వుందో ఏ పార్టీకీ సరియైన పథకం అంటూ లేదు. కేవలం శుష్క వాగ్దా నాలతో ఓట్లకోసం వల విసురు తున్నాయి. చైనా దురాక్రమణనుంచి మన భూభాగాన్ని విడిపిస్తామని అవి చేస్తున్న ప్రతిజ్ఞ ఎంత అవాస్తవికంగా, ఆధార రహితంగా వుందో వాటి మిగతా వాగ్దానాలూ అంతే. ప్రతిజ్ఞ పట్టినంత మాత్రంలో చైనావాడు మన భూభాగాన్ని ఖాళీచేసి పారిపోబోవడంలేదు. బ్యాంకు లను జాతీయం చేస్తామనో, ఆహార ధాన్యాల వ్యాపారాన్ని జాతీయం చేస్తా మనో ప్రగల్భాలు పలికినంత మాత్రాన దైనందిన సమస్యలు తీరబోవడంలేదు. సరియైన, సమర్థమైన, నిజాయితీ గల నాయకత్వం ఏ పార్టీలోనూ కనిపించడం లేదు. అది లేనప్పుడు ఏ పార్టీ అధికా రంలోకి వచ్చినా పరిస్థితులు మారే అవ కాశం లేదు. పైగా, ముందు ముందు ఇంకా అధ్వాన్నమైనా కావచ్చు.

అందుచేతనే, ఈసారి ఎన్నికలూ, వాటి ఫలితాలు దేశాన్ని ప్రస్తుతం పెన వేసుకుని, ఉక్కిరి బిక్కిరి చేస్తున్న నిరాశకు, నిస్పృహకు ప్రతిబింబాలుగా ఉంటాయా అని ఒక ఆందోళన కలుగు తున్నది.

***

---

## చందాదార్లకు మనవి

పాత చందా దారులు తిరిగి చందా పైకం పంపే టప్పుడు మీ చందా నెంబరు, అడ్రసు వివరంగా వ్రాసి మాతో సహకరించ ప్రార్థన.

మేనేజరు, "జ్యోతి"

# జ్యోతి - మార్గదర్శి

"ఒరే బుజ్జిగా ఏం చేస్తున్నావురా అక్కడ!" అని అరుస్తూ ఇంట్లోకి వచ్చారు మా నాన్నగారు. వసారాలో ఉన్న నేను ఆ కేకకు అదిరిపడ్డాను. ఏం చెప్పను. అలా చెప్పితే మానాన్న నన్ను ఉతికేయరూ! గుప్‌చుప్‌గా నే రాస్తున్న కథ తాలూకు కాగితాలు పుస్తకాలమధ్య పెట్టి సైన్సు పుస్తకం తీసి గాని చదువుతున్నాను.

"ఏరా వెధవ! ఏం చేస్తున్నావంటే పలకవేం" అంటూ గర్జించి అడిగారు. నా ప్రాణాలు అమాంతంగా పైకి ఎగిరి పోయాయి. చెమటలు పట్టేస్తున్నాయి. దేవుడు దగ్గరయినా అబద్ధం చెప్పి తప్పించుకోవచ్చుగాని మా నాన్న దగ్గర మాత్రం అది కుదరదు.

"ఏమే వీడు చదువుతున్నాడా అసలూ" అంటూ వంటింట్లో వున్న మా అమ్మని పిలిచి అడిగారు. మా అమ్మ నా పార్టీనే కాబట్టి,

"ఏవో రాసు కొంటున్నట్టున్నాడు, మీరు ఇంతగా వాడిని కేకలేస్తే భయపడి పోతాడు కుర్ర నాగన్న" అని సుకుమారంగా సమాధానం చెప్పింది.

"అసలు వీడినికాదే అనడం. విన్నా....విన్నా అనాలే. ఇలాగయితే అసలు వీడు ఈ సంవత్సరం పాసవు తాడాఅంట! ఎస్. ఎల్. సి పరీక్షలంటే మాటలంటే!" అంటూ.

"ఒరే బుజ్జిగా ఇలా రా" అని దూరంగా ఉన్న నన్ను రమ్మనమన్నారు. బిక్కు-బిక్కుమంటూ మా నాన్నగారి సమక్షానికి వచ్చి నిలబడ్డాను. చలనంలేదు నాలో. జరగబోయే పరిస్థితిని తలచుకోగానే....మన తెలుగు సినిమాలో మాదిరిగా నా శరీరంలో తుఫానులు, భూకంపాలు, రైళ్ళు గుద్దుకోవడం లాంటివి జరిగాయి. నాయెదుట ఉన్న అమ్మా, నాన్న, కుర్చీ, స్థంభం నా కంటికి మసక మసకగా కనబడుతున్నారు. కళ్లు తిరుగుతున్నాయో, నేనే తిరుగుతున్నానో గమనించలేక పోయాను.

---

విద్యార్థుల చిన్నకథల పోటీలో

మొదటి బహుమతి రూ. 50

## జి. నాగేశ్వరరావు,

[బి. ఎస్. సి. (ఎమ్. పి. సి.) ఫస్టియర్. మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజి, విశాఖపట్నం.]

"ఏరా వెధవా! దిష్టిబొమ్మలా నిలబడ్డావే" అనేసరికి నా మత్తు, మచ్చుకయినా లేకుండా నన్ను వదిలిపోయింది.

"నీకు పరీక్షలు ఎప్పటి నుంచి ?"

"మార్చి ఏడునుంచి."

"ఏడుపు మొహం పెట్టుకొని ఇలాగే ఏడుస్తావా. చదువుదామని ఉద్దేశ్యం ఏదైనా ఉందా."

"ఉంది."

"ఐతే ఇప్పుడు రాస్తున్నది ఇలా తీసుకురా"

నేను అనుకొన్నట్టు గానే జరిగింది. ఇక లాభంలేదు. తప్పు ఒప్పుకొని, పెట్టబోయే ఆ రెండు చివాట్లు తిని ఇక శ్రద్ధగా చదువుకోవా లనుకున్నాను. నన్ను ఈ కొంపలో పుట్టించిన బ్రహ్మని చాలావరకు తిట్టాను. అసలు విషయం ఏమంటే నాకు చిన్నప్పటి మంచి కదలు రాయాలని పిచ్చి. అందులో "జ్యోతి" మొదలయిన పుస్తకాలలో మా విద్యార్థులకు పెట్టిన పోటీల లాంటివి అంటే నాకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. కాని ఏం లాభం. నాలో అజ్ఞాతంగా ఉన్న ఈ ఉత్సాహాన్ని ఎన్నాళ్ళిలా దాచుకోను మీరే చెప్పండి. కాకినాడ వెళ్తానని చెప్పిన మా నాన్న అమాంతంగా మనసు - మార్చుకొని ఇంటికి వస్తారనీ, నన్ను ఇలా నిలదీసి అడుగుతారనీ కలలోకూడ అనుకోలేదు. సరే ఏమనుకొని ఏం లాభం. నేను రాసిన ఆ నాలుగు కాగితాల కధని వరుసలో పెట్టి మా నాన్న దగ్గరికి దారి తీసాను.

"పదడుగులు నడవడానికి పది నిమిషాలు కావాలట్రా నీకు" అని నామీద మండి పడ్డారు. ఇలాంటిచిన్నవి (తిట్లు) నాకు రోజూ అనుభవమే కాబట్టి అది నాకంత ఎఫెక్టు కలిగించలేదు.

"రాసింది ఇలాగియ్యి" అని చేతులలోని కాగితాలు తీసికొని, "ఆ బల్లమీద కళ్ళజోడు అందుకోరా" అని పురమాయించారు. కీ ఇచ్చిన యంత్రంలా వెళ్ళి తెచ్చి ఇచ్చాను. ఒక్కొక్క అక్షరమే చదువుతున్నారు. నా కూ ఒక్కొక్క క్షణమే దగ్గర పడుతోంది. మా అమ్మ మా ఇద్దరివైపు వింతగా చూస్తోంది. బహుశా మా నాన్న గారి ఎదుట ఇంతసేపు నేను నిలబడటమే కావచ్చు. సగం చదివినట్టుగా రెండు కాగితాలు పూర్తి అయ్యాయి. ఆ క్షణంలో నేను మ్రొక్కని దేముడూ, తలవని పుణ్యక్షేత్రము లేదనుకోండి. యధా ప్రకారంగా చెమటలు ఆటో మాటిగ్గా నా తనువంతా వ్యాపించాయి. తలెత్తి మా నాన్నగారి ముఖంలోకి మొదటిసారి సూటిగా చూశా. నేను

రాసిన కథను మడతపెట్టి జేబులో పెట్టు కున్నారు కళ్ళజోడు తీసి బల్ల మీద పెట్టారు. అమ్మా, నేనూ మా నాన్నని గమనిస్తూనే ఉన్నాం. అంతే! ఒక్క క్షణం నిశ్శబ్దం. మా నాన్నగారు పెంకులు ఎగిరిపోయేలా .నవ్వేరు. ఆ నవ్వుకి అంతులేదు. బాగుండదు కదా అని నేనూ, మా అమ్మా కడు పుబ్బ నవ్వాం.

"నోరు ముయ్యండి రాస్కెల్స్ నేమ కథ బాగుంది నవ్వుతోంటే మీరూ నవ్వుతారట్రా?" అంటూ మా మీద విరుచుకు పడ్డారు.

"ఒరే అబ్బాయి" అని దగ్గరకు పిలిచారు. ఆ కంఠంలో మునుపెన్నడూ లేని ఆప్యాయిత ఉంది. వెళ్ళి పక్కన నిలబడ్డాను.

"కథ చాలా బాగా రాసావు. నీకింత తెలివితేటలు ఉన్నాయని నాకు ఇప్పటికీ నమ్మకం కలగడం లేదు. తప్పకుండా ఈ కథ "జ్యోతి"లో వేసుకొంటా రబ్బాయి. కాని నువ్వుమాత్రం పప్పులో అడుగు వేశావురా" అని అన్నారు.

"ఎందుకు? ఎలా?" అన్నట్టు ఫోజు పెట్టాను.

"వెర్రి నాన్న....జ్యోతిలో నీ కథ పడాలని ఉంటే నీకు ఈ ఎస్. ఎస్. యల్. సి. చదువు చాలదురా. నువ్వు కాలేజి విద్యార్థివి కావాలి. ఆ పోటీ ఒక్క కాలేజి కుర్రాళ్ళకేరా" అని నా భుజం తట్టారు.

అంతే నాలోనేను నిర్మించుకొన్న ఆశాసౌధాలు ఒక్కసారిగా కూలి పోయాయి. "ఇక నేనూ నా కథ ఏం కావాలి? తప్పకుండా శ్రద్ధగా రాయాలి. రాయాలి. తప్పకుండా వేసుకొంటారు. బహుమతి వస్తుంది. తప్పకుండా వస్తుంది." అని నాలో నేను అను కొన్నా.

* * *

ముసలమ్మ నడకలాగ ఆ మూడు నెలలు గడిచాయి. నేను ఫస్టు మార్కులతో ప్యాసయ్యాను నాన్న గారు కాలేజీలో చేర్పించారు. అంటే నేనిప్పుడు కాలేజివిద్యార్థినిఅన్న మాట. నేను చదివిన చదువుకు ఫలితం దక్కింది. నేను రాసిన కథకు తగిన శుభ సమయం వచ్చింది. ఇప్పుడు 'జ్యోతి'కి కథ రాయడానికి తగిన అర్హత నాకు ఉంది కదూ. అందుకే ఇప్పుడే నా కథ కథగారాసి 'జ్యోతి'కి పంపిస్తున్నా.

నన్ను బాగాచదివేట్టు చేసి, కాలేజిలో చేరడానికి ప్రోత్సహించిన 'జ్యోతి'కి నా కృతజ్ఞత.

***

# "నిజమైన అబద్ధం"

మన్ అండ్ టు ఐ లవ్‌యూ....

హుషారుగా ఇంగ్లీషు ట్యూను హమ్ చేస్తూ పరుగెత్తే శివానందం పురఫ్ ఎమ్. ఎస్. నేందా లేదా ఆనంద్ కాలూకు కాళ్ళు 'అసంకల్ప ప్రతీకార చర్య'కు ఉదాహరణలాగ స్తంభించి పోయాయి, వాళ్ళ నాన్నగారి పాద రక్షలు గుమ్మంలో కన్పించగానే. హత్యా ప్రదేశంలో విలన్‌లాగ, 'నాగార్జున సాగర్ డామ్' పూర్తవుతున్నంత మెల్లిగా అడుగులో అడుగు వేసుకొంటూ హాల్లోకి వచ్చాడు. బామ్మ చాపమీద కూర్చొని భగవద్గీత చదువుకుంటోంది. "బామ్మా! నాన్న ఇంట్లో లేరా?" మెల్లిగా అడిగాడు. కళ్ళజోడు పరిచేసుకొని, తల పైకెత్తి "ఏరా! నీకిప్పుడు కన్పించిందా ఇల్లు? ప్రొద్దు పొడవకుండా పోయినవాడివి, రాత్రి పది గంటలకా రావడం? మీ నాన్న ఇప్పటివరకూ నీకోసమే చూసి బెజవాడ వెళ్ళాడు. ఏదో పనుందంటూ. వాడుండాల్సి...." అని ఆవిడ ఇంకా ఏదో అంటూండగానే "కట్, బామ్మా! కట్! ఇవాళ కాలేజిలో జీతం కట్టాలన్నారు హఠాత్తుగా. నాన్న గురించి షాప్‌కి ఫోన్ చేస్తే లేడన్నారు. అప్పుడు వెంటనే సైకిలు తాకట్టు పెట్టి ఓ వంద రూపాయలు పుచ్చుకొని కట్టేశాను. ఏం చెయ్యను బామ్మా! నాన్నకు చెప్పినా తెలీదు నా అవసరాలు. ఏదో శ్రద్ధగా చదువుదామంటే ఇదీ వరస! మా కాలేజికి షిఫ్టు ఒకటి తగలడిందిగా? ప్రొద్దుట కాలేజి, సాయంత్రం ఎన్. సి. సి. బావనా! మీకేం చెప్పినా తెలీదు." బుంగమూతి పెట్టాడు బుజ్జి శివానంద్, నాన్న ఇంట్లో లేడనేసరికి, ఆ హుషారులో ఓ చిన్న సైజ్ ఉపన్యాసం దంచేసి. "ఒక టడిగితే వంద చెప్తావు. ఇలా ఎన్ని వందలు తగలెట్టావో! అయినా, ఇలా మాటిమాటికీ సైకిలు తాకట్టు పెట్టడమేమిట్రా పరువు తక్కువ పని? చదువుకోసమని అడిగితే నేనివ్వనూ?" అంటూ లేచింది అమాయక బామ్మల ప్రతినిధి. "బామ్మా! దేశంలో నీలాంటి బామ్మలో వందమందుంటే ఎంత బాగుపడిపోను ప్రజలు!" ఆవిడ తెచ్చిచ్చిన నోట్లు లెక్కపెట్టుకుంటూ ఓ కాంప్లిమెంటు పారేసి బయటకు పారిపోయాడు, "భోంచేసి వెళ్ళరా!" అన్న బామ్మ మాట వినకుండా. "ఎంత శ్రద్ధో చదువంటే! పిచ్చి

రెండవ బహుమతి రూ. 25

**ఉండమూటి తాతాజి,**

[బి. ఎ. (హెచ్. పి. ఎస్.) సెకండియర్ గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, రాజమండ్రి.]

పోవ్యాసి!" అంటూ తృప్తిగా నవ్వు కొందావిడ.

"కాయా? పండా?" ఆత్రుతగా అడిగాడు, వీధి చివర అప్పులాడిలా కాపిన మిత్రుడు సుబ్బారావు. "ఒరేయ్! మనం ప్లాన్ వెయ్యడం, అది జరక్క-పోవడమూనా!" కాలర్ సర్దుకుంటూ నంబియార్ నవ్వొకటి పారేశాడు శివానంద్. "ఒరేయ్, ఒరేయ్! నవ్వి భయపెట్టకు. మీ బామ్మ భోళా మనిషి కవక నీ సైకిల్ నా రూమ్‌లో పెట్టి, తాకట్టుపెట్టేసి ఫీజు కట్టానంటే నమ్మేసి దబ్బిస్తోంది. అదే మీ నాన్న దగ్గర తీసుకో చూద్దాం!" ఛాలెంజ్ చేశాడు సుబ్రావ్. "మై డియర్ సుబ్రావ్! ఈ డబ్బుగల శుభసమయంలో పాదర్స్ ప్రసక్తెందుకు? నడు. లెటజ్ ఎంజాయ్!" చిద్విలాసంతో సమాధానం. రిక్షా ఎక్కారిద్దరూ.

ఓ పది రోజులు తరవాత మళ్ళా అదే దృశ్యం తెలుగు సినిమా జానపద కథలాగ. బి. ఎస్‌సి. విజయావాళ్లూ బోటనీ టూర్‌కి వెళ్తున్నారు. ఎలా గయినా, సుబ్రావ్‌గాడికి తెలియకుండా వాళ్ళతో టూర్‌కి వెళ్ళాలనే సదుద్దేశంతో ఇంట్లో ప్రవేశించిన ఆనంద్ "బామ్మా! ఎగ్జామినేషన్ ఫీజు కట్ట



టాని కివాళే ఆఖరు రోజు. అంచేత సైకిల్ తాకట్టు...." డైలాగులు మర్చిపోయిన నటుడిలాగు నసుగుతున్నాడు, ఒకప్రక్క నేరోకట్ పాంట్‌తో బాపమీద కూర్చోవడానికి నానా అవస్థా పడుతూ. "నీ కిదేం పోయేకాలంరా! సైకిలు తాకట్టు పెట్టటమేమిటి ఖర్మం! (సైకిలు తాకట్టు పెట్టే ఖర్మం నాకేమిటి బామ్మా! అది శుభ్రంగా సుబ్రావ్ రూమ్‌లో పడుకొంటేనూ - ఆనంద్ స్వగతం) ఇదప్పుడే ఆరోసారి! కాలేజీకి కట్టాలంటే నేనిస్తానన్నాగా! వంద రూపాయల భాగ్యానికి ఈ అప్రదిష్టపు పనులు చెయ్యాలా? ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యనంటే ఇస్తాను" అందావిడ లేస్తూ. "నీకేం చెప్తావు ఆఖరు రోజంటే నేనేం చెయ్యను? అంత దూరంనుంచి సైకిలుమీద రానా? స్కూటర్ కొనమంటే నాన్న కొనడు. అవసరమై ఏదో బాధలు పడి నేనిలా చేస్తే...." వాళ్ళ నాన్న గదిలోకి రావడం చూడకపోతే శివానందుల ఉపన్యాసానికి అంతముండేదో, లేదో చెప్పడం కష్టం.

"నువ్వేమీ కష్టపడి కట్టనక్కరలేదు. నడు. సైకిలు ఎక్కడ తాకట్టు పెట్టావో చూపించు. వాడికి నేనిస్తాను. ఇకముందు నీకూ, వాడికీ ఆ అవసరం లేకుండా చూస్తాను" అంటూ బయటకు నడిచారాయన. మొరార్జీ గోల్డు కంట్రోల్ అంత దారుణంగా దెబ్బ తినేసింది శివానంద్ ప్లాన్. ధైర్యం దిగజారిపోయింది. వెనకనే పిల్లిలాగా అనుసరించాడు.

కారు సుబ్బారావు రూమ్ ముందు ఆగింది. ఇద్దరూ కారు దిగి ఒక రూమ్‌లోకి ప్రవేశించారు. "ఇక్కడే కూర్చో నాన్నా! లోపలికి వెళ్ళి అతనిని తీసుకువస్తాను" అంటూ కుర్చీవేసి లోపలికి వెళ్ళాడు శివానంద్. సుబ్రావ్ ఎక్కడా కనిపించలేదు. ధైర్యం సన్నగిల్లింది. సుబ్రావ్ రూమ్-మేట్ భాస్కర్ టాయిలెట్ అవుతున్నాడు. చివరి రూమ్‌లో. "ఏరా! సుబ్బారావ్ ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు ఆత్రుతగా ఆనంద్.

"ఈపాటికి బెజవాడ వెళ్ళుంటాడు" అన్నాడు భాస్కర్ తాపీగా.

"అదేమిటి?" అన్నా డాశ్చర్యంగా శివానంద్.

"నీకు తెలీదా? విజయా వాళ్ళ క్లాస్ టూర్‌కి వెళ్ళారుగా! అందుకని నీ సైకిలు ఓ మార్వాడి దగ్గర తాకట్టు పెట్టి వాళ్ళతో చెక్కేశాడు. ఐదు రూపాయలు అప్పుచ్చుకొని నేను సినిమాకి వెళ్తున్నా...." తను ప్రేమిస్తున్న అమ్మాయి ఉన్నట్టుండి బ్రదర్ అని పిలిచేసినట్టూ, కరెంట్ కోత వలన సినిమా హాల్స్ మూసేసినట్టూ, కాపీ చేస్తూంటే ఎగ్జామినర్ పట్టుకున్నట్టూ, కళ్ళు తిరుగుతున్నట్టూ అనిపించింది శివానంద్‌కి. ఆ తరవాత ఇంకేం విన్పించలేదతనికి. అందుక్కారణం, అతనికి చెవుడూ, పరాకుగా వినే గుణం వుండటం మాత్రం కాదు.

***

# మచ్ ఎడో ఎబౌట్ నథింగ్

రాత్రి తొమ్మిదన్నరకి మొదటి ఆట సినిమా చూసి వస్తూండగా సన్నగా వానతుంపర మొదలయింది. అప్పటికే కొంచెం తడిసిపోయి, తుల్జా భవన్ బస్ స్టాపు షెల్టరులో తల దాచుకుందుకు పరిగెట్టాను. అప్పుడే బస్సు వచ్చేటట్టు లేదు. జల్లు లోపలికి కొడుతోంది. కొంచెంగా చలిపెడుతోంది. ఎదురుగా 'టూరిస్టు హోటలు' పేరు ఎర్రగా మెరుస్తోంది. సిటీ బస్సులు హడావిడిగా రొదచేసుకుంటూ పోతున్నాయి; కాని, నేను ఎక్కవలసిన బస్సు ఇంకా రాకపోయేసరికి నాకు చిరాకు మొదలయింది.

ఏమీ తోచక మిగతా జనంకేసి చూడడం మొదలెట్టాను. ఒక యువక జంట సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. మరొక పక్క ముసలాయన ఒకడు చలిగాలికి వణుకుతూ ముడుచుకుని కూర్చున్నాడు. వీళ్ళుకాక మధ్యన ఒక నాలుగేళ్ళ చిన్న అమ్మాయి జోగుతూ కునికిపాట్లు పడుతూంది. నూనె రాసుకోని జుట్టూ, బురదలో ఆడుకుందేమో, మట్టిమరకలున్న పరికిణీ - ఇదీ ఆ అమ్మాయి అవతారం. చూడగా చూడగా నాకు ఈ అమ్మాయి వీళ్లెవరికీ సంబంధించినది కాదేమో అనిపించింది. ఇంత చిన్న పిల్లని వదిలేసి తల్లి ఎక్కడికి పోయుంటుంది? బహుశా, అలా పక్కకి ఏవైనా వెళ్ళి ఉండవచ్చు వస్తుందేమోనని చూస్తూ నిల్చున్నాను.

పావుగంట గడిచిపోయింది. బస్సు రాలేదు. ఆ అమ్మాయి అక్కడే నిద్రపోతూంది. అనుమానం వచ్చింది నాకు.... బహుశా, బస్సు ఎక్కే హడావిడిలో తప్పిపోయిందేమో. పక్కన ఉన్నాయన్ని అడిగాను - ఆయనకూడా తలూపి "నాకుకూడా అలాగే అనిపిస్తోందండీ.... అరగంటనించీ చూస్తున్నాను. ఆ అమ్మాయి అలాగే ఉంది. కాని, ఎవరూ మాత్రం రాలేదు" అన్నాడు.

చూస్తూ చూస్తూ ఆ అమ్మాయిని అలా ఒంటరిగా వదిలివేయ బుద్ధి కాలేదు. పోనీ, ఒక పని చేద్దామని ఆ పిల్లని తట్టి లేపాను. లేచినట్టే లేచి మళ్ళీ జోగడం మొదలెట్టింది. "నీ పేరేమిటి పాపా?" అన్నాను మళ్ళీ లేపుతూ. మాట్లాడకుండా నాకేసే తెల్లబోయి చూడ్డం మొదలెట్టింది. తెలుగు తెలియదనుకున్నట్టున్నాడు నా పక్కాయన - కొంచెం విసుగ్గా మొహంపెట్టి "తుమ్హారా నామ్ క్యాహై?" అని అడిగాడు హిందీలో. ఆ అమ్మాయికి

---

రెండవ బహుమతి రూ. 25

వి. వి. సత్యనారాయణమూర్తి,

[బి. ఇ. (ఫైనల్) కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాదు.]

భయం వేసిందిగాన్న. ఏడుపుమొహం పెట్టింది. ఏమడిగినా చెప్ప లేక పోతోంది.

చివరకి నాకు విసుగొచ్చి, పోలీసు రిపోర్టు యిద్దాం అన్నాను దగ్గరున్న వాళ్ళతో. వాళ్ళు ఇబ్బందిగా మొహం పెట్టి 'ఈలోపుగా బస్సువచ్చేస్తుందేమో' అంటూ నసిగారు. నాకు మాత్రం ఆ పిల్లని అలా వదిలివేయడం యిష్టం లేక పోయింది. దగ్గరే ఉన్న కిళ్ళీకొట్టు అతనితో ఆ అమ్మాయిని చూస్తుండమని చెప్పి కాదిగూడా పోలీసు స్టేషనుకి బయలు దేరాను.

ఓ పావుగంట గడిచాక పోలీసుని వెంట బెట్టుకుని వెళ్ళిచూస్తే ఆ పిల్ల అక్కడ కనిపించలేదు. దానికితోడు ఆ ముసలాయన, యువక జంటకూడా లేకపోయే సరికి కంగారుగా కిళ్ళీకొట్టతని దగ్గరకెళ్ళి, 'ఏమయిందాపిల్ల' అని అడిగాను ఆత్రంగా. అతను నవ్వుతూ "ఏమీ లేదండీ! ఆ అమ్మాయి యిల్లు ఆ వెనకాతలే ఉందట. బురదలో ఆడి, పరికిణీ మాపుకుందని ఆఅమ్మాయి తల్లి క్కోపం వచ్చికొట్టిందట. దాంతో అలిగి అన్నం తినకుండా యిక్కడ నీరసంగా నిద్రపోతూందిట వాళ్ళంతా కంగారుపడి వెదికితే ఇక్కడ కనిపించింది. ఇప్పుడే వచ్చి తీసి కెళ్ళిపోయారు" అన్నాడు.

ఇదంతా ఓపికగా విన్న పోలీసు నాకేసి కోపంగా చూస్తూ ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

నేవెళ్ళ వలసిన ఆఖరిబస్సు పది నిముషాల క్రితమే వెళ్ళిపోయింది (ట) ఈ అర్థంలేని హడావిడితో తనకేం పని లేదన్నట్లుగా.

***

---

★ ఒక ప్రసిద్ధ చలనచిత్ర తార :— "నేను సినిమాల్లో కొచ్చి పదేళ్ళయింది. ఇప్పటికి తెసులుకున్నాను నేను సినిమాలకి పనికిరానని."

పత్రికా విలేకరి :— "అయితే సినిమాలనుంచి తప్పుకుందామనుకుంటున్నారా ?"

తార :— "ఉహూ. ఎలా తప్పుకోను ? నేనిప్పుడు ఇరవై నాలుగు సినిమాల్లో నటిస్తుంటే ?"



నదాసుని పిలిచి "శ్రీరామచంద్రమూర్తిని ఏలూరు ట్రాన్స్‌ఫరు చేసినట్లు అక్కడి డిస్ట్రిక్ట్ ఆఫీస్‌లోని ప్రతాపరెడ్డిని యిక్కడికి ట్రాన్స్‌ఫరు చేసినట్టు ఒక ఆర్డర్ పుటప్ చేయి. అట్లాగే వివేకానందంను క్యాంపుక్లార్కు సీటులో వేసినట్టుగా ఒక ఆఫీసు ఆర్డరు కూడా పుటప్ చేసి తీసుకురా" అని చెప్పి తన గదిలోకి వెళ్ళాడు.

ఆఫీసులో ఒక్కసారి గగ్గోలు పుట్టింది. ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిగా ఎన్నికైన ఆక్షణంలో పార్లమెంటు హాలులో కనబడిన దృశ్యాన్ని

కొంచెం అటూ యిటూగా యిక్కడ ఊహించు కోవచ్చు!

అజేయుడైన శ్రీ రామ చంద్ర మూర్తి దిగిపోయ్యాడు! అనామకుడైన వివేకానందానికి పట్టాభిషేకం జరిగింది!!

ఆఫీసులోని పద్నాలుగు మంది గుమాస్తాలూ ఒక్కసారి వివేకానందం చుట్టూ చేరారు.

"కంగ్రాచ్యులేషన్స్"

"మై హార్టీ కంగ్రాచ్యులేషన్సండీ.."

"వివేకా! పద ముందు! అగం టుగా చిన్న సైజు పార్టీ చేయి ముందు. తరువాత డిన్నరు ఇద్దుగానిలే" అన్నాడు భగవానులు. ఆతడొక్కడే యీ ఆఫీసులో వివేకానందాన్ని ఒరే, అని పిలువ గలిగిన స్నేహితుడు.

భగవానులు యీ ప్రపోజలు చేయ గానే మోహనదాసు రెండంగల్లో మేనేజర్ గదిలోకివెళ్ళి "సార్ కొత్త సి. సి (క్యాంపు క్లార్క్) పార్టీ ఇస్తున్నాడండీ. అదయ్యాక వచ్చి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ పుటప్ చేస్తాను" అన్నాడు.

"నో, నో, మిస్టర్ దాస్. డి. డి (డిప్యూటీ డైరెక్టరు)గారు ఊరుకోరు. ఆయన హాఫెనవర్‌లో పంపించమన్నారు. హాఫెనవర్ అంటే అరగంట. అంతే, ముందు అవి పుటప్‌జేసి వెళ్ళండి" అన్నాడు మేనేజరు.

మోహనదాసు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు తయారు చేసి మేనేజరు టేబులు మీదికి చేర్చేటప్పటికి మరో పది నిము షాలు పట్టింది. ఈ పది నిముషాలు మిగిలిన వాళ్ళంతా వరండాలో నిల్చొని (వివేకానందం చుట్టూ) హస్కుకొడుతున్నారు.

ఇంతలో ఆఫీసు ప్యూన్లు యిద్దరూ వరండాలోకొచ్చారు. "ఏంది బాబూ మమ్మల్ని అట్టిగెల్లరా టీ పార్టీకి?" అని అడిగాడు మల్లన్న వివేకానందం వైపు చూస్తూ.

"అదేమిటి మల్లన్నా? మీరు లేకుండానా? మాతో నువ్వొద్దువుగాని. భీముడు యిక్కడే వుంటాడు. వచ్చేటప్పుడు భీముడికోసం హోటలునుంచి నువ్వు కాఫీ టిఫిను తెద్దువుగానిలే" అన్నాడు వివేకానందం.

ఆఫీసులో ఇద్దరు ప్యూన్లు వున్నారు. ఒకతను ఎస్టాబ్లిష్‌మెంటు సెక్షన్‌లో పని చేస్తున్నాడు కాబట్టి యిద్దరిలోకీ అతడికే ప్రిఫరెన్సు ఎక్కువ!

మధ్యాహ్నం రెండున్నరయింది.

ఆఫీసు మేనేజరునూ, భీముడినీ వదిలేసి అందరూ మెయిన్‌రోడ్ మీద వున్న 'శారదా భవన్'కు బయలు దేరారు. ఆఫీసు మేనేజరు టీపార్టీలకూ వాటికీ రాడు. హోటలునుంచే ఆయనకు టిఫినూ కాఫీ పంపుతుంటారు.

శారదా భవన్ స్పెషల్ రూంలో కూర్చున్నాక భగవాన్లే చొరవ తీసుకుని పదిహేను స్వీట్లు ఆర్డరిచ్చాడు. సర్వర్ అవి తెచ్చి పెట్టగానే పదిహేను చపాతీ తెమ్మన్నాడు.

"డి. డి. గారి సి. సి ఆరోగ్యానికి

....." అందరూ స్వీట్లు త్రుంచి నోట్లో వేసుకొన్నారు.

పోలీసు కానిస్టేబుళ్ళ పేర్లు వాళ్ళ సర్వీసు పెరిగిన కొద్దీ మరుగున పడి పోతాయి. అట్లాగే ఒక ఆఫీసులో ఎక్కువ సర్వీసు వున్న గుమాస్తాకు అతడి పేరు మరుగున పడిపోతుంది "ఎ ఒన్" అనో "బి ఫోర్" అనో "సి సెవెన్" అనో "డి టు" అనో వున్న అతడి సీటు పేరుతో అతడు స్థిరపడిపోతాడు.

కాని ఈ ఆఫీసులో క్యాంపు క్లార్కు మటుకు అతడు సీటు తీసుకొన్న మరు క్షణమే "డి. డి. గారి సి. సి. గా మారి పోతాడు.

సి. సి. ని చూస్తే మేనేజరుకైనా హడలే. చండ ప్రచండుడైన నాగ రాజుకు ఆఫీసు మేనేజరుకన్నా క్యాంపు క్లార్కే సన్నిహితంగా వుం టాడు. మరి నాగరాజుకు సన్నిహితంగా వున్న ఏ వ్యక్తిని చూసినా డిపార్టు మెంటులోని జిల్లా అధికార్ల దగ్గరనుంచీ ఆఫీసు ప్యూన్లదాకా అందరికీ వణుకు పుట్టక తప్పదు.

డిప్యూటీ డైరెక్టరైన ఈ రెండేళ్ళ లోనూ నాగరాజు పంచాయిమ్మిది మందిని సస్పెన్షన్‌లో వుంచాడు. పదకొండు మందిని డిస్మిస్ చేసేడు. యాభై ఎని మిది మందికి యింక్రిమెంట్లు ఆపేశాడు. ఎంతమందికి వార్నింగులు యిచ్చాడో, "సెన్సర్"లు యిచ్చాడో తేల్చాలంటే అదో పెద్ద పని.

ఇన్ని పనిష్మెంటు ఆర్డర్లూ నాగరాజు స్వయంగా డిక్టేట్ చేస్తుంటే క్యాంపు క్లార్కు పక్కనే నిలబడి గబగబా లాంగ్ హాండులోనో, షార్టుహాండు లోనో రాసుకోవాలి.

ఆఫీసులో డిప్యూటీ డైరెక్టరుగారు ఫైళ్ళు చూస్తున్న సమయంలో క్యాంపు క్లార్కు అనే వ్యక్తి పక్కనే నిలబడాలి. ప్రతి ఉదయం క్యాంపు క్లార్కు బంగళాకువెళ్ళి నాగరాజుకు కనిపించాలి. ప్రతి సాయంత్రం ఆయన సెన్నిస్ ఆడి యింటికొచ్చే టప్పటికి క్యాంపుక్లార్కు హాజరుగా వుండాలి!.... ఇహ క్యాంపు క్లార్కు పక్కన లేనిదే డిప్యూటీ డైరెక్టరు ఎక్కడికీ క్యాంపుకు బయలు దేరడు....

అందుకే డిపార్టుమెంటులో ఆఫీసర్ల నుంచీ జవాన్లదాకా డి. డి. గారి సి. సి. అంటే అంత భయం.

## 2

ఉదయం ఎనిమిది గంట లయింది. మామూలు రోజుల్లో అయితే యీపాటికి హడావిడిగా అన్ని పనులూ పూర్తిచేసు కొని వివేకానందం డిప్యూటీ డైరెక్టరు గారి బంగళాకు పరిగెత్తేవాడే. ఆదివారం గాబట్టి యివ్వాళ అతడికి బంగళాలో పొద్దున కొలువు లేదు. డిప్యూటీ డైరె క్టరు ఆదివారం నాడు పగలు పన్నెం డింటిదాకా వుంటాడు. ఏవయినా ఫైళ్ళు వుంటే మధ్యాహ్నం చూస్తాడు. అందు చేత ఆదివారంపూట మధ్యాహ్నం దాకా వివేకానందం శెలవు దినాన్ని ఆస్వా దిస్తూ కూర్చోవచ్చు.

మొగుడికి రెండోమాటు కాఫీ యిచ్చి, శారద తనూ ఒక గ్లాసు కాఫీ చేత్తో పట్టుకొని వివేకానందం ఎదురుగా ఫేము కుర్చీలో కూర్చున్నది.

ఈ టీ స్టాండు, దానిచుట్టూ నాలుగు ఫేముతో అల్లిన యినప కుర్చీలూ యిటీవలే కొన్నవి. ఆ మధ్య ఎక్స్టెన్షన్ ఆఫీసరు నారాయణరెడ్డి "డి. డి. గారి సి. సి." ని చూడటానికి యిక్కడకొస్తే యింట్లో ఒక్క కుర్చీ తప్ప రెండోదిలేదు కూర్చొనటానికి. అతడిని కుర్చీలో కూర్చోపెట్టి తాను మంచం వాల్చుకుని కూర్చున్నాడు వివేకానందం. ఈ దుర్గతి చూసి నారాయణరెడ్డి సహించలేక పొయ్యాడు! అప్పటి కప్పుడు వివేకానందాన్ని బజారు తీసుకెళ్ళి నూట పదిహేను రూపాయలు పెట్టి యీ సెట్టు కొని యిచ్చాడు!...

"సాయంత్రం మీకు డి. డి. గారితో కాపరం లేకుండావుంటే ఏదైనా సినిమాకి వెళ్దామండీ" అన్నది శారద.

"ఓ, దానికేం! అట్లాగే వెడదాం. నేను బంగళాకు వెళ్ళొచ్చేటప్పటికి రెడీగా వుండు.... అన్నట్టు రేపు నేను ఆఫీసుకెళ్ళి భీముడ్ని పంపిస్తాను. ఆ నాలుగు టెర్లిన్ షర్టులూ, మూడు వులెన్ ప్యాంటులూ లాండ్రీకిపంపించు. గురువారంనాడు విజయవాడ క్యాంపుకు బయలు దేరేటప్పటికి కావాలి"

"అట్లాగే. ఈసారి క్యాంపునుంచి వచ్చేటప్పుడు నాకో బెనారస్ పట్టుచీర తెద్దురూ. నీలం రంగుది. మొన్న మా

శ్యామల మొగుడు విజయవాడనుంచే తెచ్చాడుట. ఎంత బాగుందో...."

శారద మాటలకు అడ్డొస్తూ యింటి ముందు డిప్యూటీ డైరెక్టరు గారి ఫియెట్ కారు ఆగింది.

వివేకానందం ఆశ్చర్యపోతూ వరండాలో కొచ్చాడు. కారులోంచి డ్రైవరు సాంబమూర్తి ఠీవిగా దిగాడు. ఒక్క డి. డి. గారి బంగాళాలో తప్ప మరెక్కడా సాంబమూర్తి కారు డ్రైవరులాగ ప్రవర్తించడు. తాను డి. డి.గారి కారు డ్రైవరు కాబట్టి డిపార్టుమెంటులో అందరూ తనకు లోకువే అని అతడి నిశ్చితాభిప్రాయం.

సాంబమూర్తి ఎడమచేత్తో సిగరెట్ కాలుస్తూనే వివేకానందం దగ్గరకొచ్చి "అయ్యగారు మిమ్మల్ని వెంటనే పిలుచుక రమ్మన్నారండీ" అన్నాడు.

"ఎందుకోయ్ ?"

"నాకేం తెలుసండీ ? పిలుచుకు రమ్మన్నారు. అంతే."

"సరే వస్తున్నానుండు" అంటూ వివేకానందం లోపలికి వెళ్లాడు.

సాంబమూర్తి తెచ్చిన వర్తమానం శారద లోపలినుంచే విన్నది. "బాగుందండీ ? కొలువుకు వేళాపాళా వుండక్కర్లేదా?" అన్నది నిష్ఠూరంగా.

"గట్టిగా అరవకే బాబూ ! వాడు విన్నాడంటే కొంప లంటుకుంటయ్."

వివేకానందం భయపడటం చూస్తుంటే శారదకు నవ్వొచ్చింది. "అదేమిటండీ అంత భయపడతారూ ? డ్రైవరన్నాగూడ హడలేనా?" అంటూ నబ్బూ టవలూ అందించింది.

"భలేదానివే ? మినిస్టరు దగ్గిర పి. ఎ అని ఒకడుంటాడులే. ఆయన డిప్యూటీ తాహసిల్దారుతో సమానం. అయితే మటుకేం ? అయనతో పెకె సెక్రటీలు, జిల్లా కలెక్టరులూ ఎంత వినయంగా మాట్లాడుతుంటారో తెలుసునా? ఎందుకని ? ఆయన మంత్రిగారి పి. ఎ. గారు కాబట్టి. ఇదీ అంతే" అంటూ వివేకానందం మొహం కడుక్కునేందుకు బాత్‌రూమ్‌వేపు వెళ్లాడు.

డి. డి.గారి కారులో వివేకానందం బంగళాకు వెళ్ళేటప్పటికి డిప్యూటీ డైరెక్టరు యింట్లోనే లేరు. క్లబ్బుకు పొద్దున్నే వెళ్ళారుట ! ఆ విషయం ఆయన అర్ధాంగి గౌరీదేవి స్వయంగా చెప్పింది. "పొద్దునే ఆయన క్లబ్బుకు వెడ్తూ మీకు కబురుచేయమన్నారయ్యా. ఏం లేదు. బజారెళ్ళి రావాలి. లిస్టు రాసేవుంది. కార్లో వెళ్ళి అలా లిస్టు మన షావుకారుకు యిస్తే పొట్లాలుకట్టి కార్లో పెట్టిస్తాడు. అంతే" అంటూ గౌరీదేవి ఒక అర్ధగజం లిస్టును, వంద రూపాయల కాగితాన్ని వివేకానందం చేతిలో పెట్టింది. "కొంచెం తెచ్చిపెట్టమనీ. మరేమీ అనుకోవద్దనీ" అని కనీసం అననైనా అనలేదు. అదేదో డ్యూటీలో ఒక భాగమని ఆమె భావం.

వివేకానందం ముఖం పాలిపోయి. నోట మాటలేక యాంత్రికంగా ఆ రెండూ తీసుకొన్నాడు. డ్రైవరు సాంబమూర్తి "రండి బాబూ !" అన్నాడు.

ఇంతలో లోపలినుంచి డిప్యూటీ డైరెక్టరు పెద్ద కొడుకు విశ్వపతి క్రికెట్ డ్రస్సులో, చేతిలో బ్యాటుతో బయటి కొచ్చాడు. "అమ్మా, మన నరసింహు లును నేను తీసికెళుతున్నాను" అంటూ చకచకా వెళ్ళి కారెక్కి కూర్చున్నాడు.

ఇవ్వాళ విశ్వపతి టీముకు కాకినాడ టీముకు క్రికెట్ మ్యాచ్ వున్నది. కావ టానికి నరసింహులు ప్రభుత్వంవారు డిప్యూటీ డైరెక్టరుకు యిచ్చిన బంట్రోతు అన్నమాటే గాని యితడిని వుపయోగించుకొనేది మటుకు విశ్వ పతే.

యాంత్రికంగా వివేకానందం వొచ్చి కారులో వెనుక సీటులో కూర్చున్నాడు. అతడి వెనకాలే నరసింహులు కూడా ఎక్కి పక్కనే కూర్చున్నాడు.

ఫియెట్ కారు ఝుంయ్‌మని బయలు దేరి అయిదు నిముషాలలో క్రికెట్ గ్రౌండు చేరింది. కారు ఆగీ అగటం తోనే నరసింహులు క్రిందికి దిగి ముందుకువెళ్ళి కారు తలుపు తెరిస్తే అప్పుడు విశ్వపతి కిందికి దిగాడు.

విశ్వపతి కిందికి దిగి క్రికెట్ బ్యాటును రెండు చేతులతో విలాసంగా పట్టుకొని యిటు తిరిగి "చూడండి, మిస్టర్ వివేకానంద్. మా మమ్మీ లిస్టులో రాసుండరు. కొట్లో బ్రిల్ క్రీమ్ వుంటుంది. తీసుకురండి. ప్లీజ్" అని యితడి సమాధానాని కయినా ఎదురు చూడక చకచకా సాగిపొయ్యాడు.

ఈ దెబ్బతో వివేకానందం పూర్తిగా నేల మట్టానికి కరుచుకు పొయ్యాడు. "ఛా! ఏమిటిది? నేను చేసేది క్లార్కు వుద్యోగమా? డి. డి. గారి బంట్రోతు వుద్యోగమా!" అనుకొన్నాడు. కారు మళ్ళా షావుకారు కొట్టుదగ్గర ఆగేదాకా అట్లాగే తలొంచుకు కూర్చున్నాడు!

డిప్యూటీ గారింట్లో సామానులు అప్పచెప్పి_విశ్వపతి బ్రిల్ క్రీంతో సహా_మళ్ళా కారులో యింటికొచ్చే టప్పటికి పదకొండు గంట లయింది.

"ఛీ! ఇంతకంటే బానిస బతుకు నయం. బాబో! యీ సి. సి. వుద్యో గానికో నమస్కారం. రేపే సిక్ లీవు పెడతాను" అనుకొంటూ కారులోంచి దిగాడు వివేకానందం. అతడు దిగటమే ఆలస్యంగా ఫియెట్ సాగిపోయింది.

కారు మలుపు తిరిగి పోవడం చూసి యిటువేపు వీధి చివర నిల్చుని వున్న ఎక్సైజ్ ఆఫీసరు బలరామరెడ్డి చక చకా యిటు వచ్చాడు. ఇంట్లోకి అడుగు పెట్టబోతున్న వివేకానందం ఎందుకో యిటు చూసి బలరామరెడ్డి కనబడగానే గడప దగ్గిరే ఆగాడు.

"గుడ్‌మార్నింగ్ సి. సి. గారూ"

"రండి. ఏమి టిలా వొచ్చారు?"

"ఊరికేనే. మిమ్మల్ని చూదా మని వస్తే మీరు డి. డి. గారి కారులో వెళ్ళారని తెలిసింది, వెయిట్ చేస్తూ నిల్చున్నాను."

"లోపలికి రండి" అంటూ వివేకా నందం ఆహ్వానించాడు,

బలరామరెడ్డిని ముందు గదిలో కూ ర్చోపెట్టి వివేకానందం లోపలికి

ళ్ళాడు కాఫీ పెట్టమని శారదతో చెప్ప టానికి.

మధ్య గదిలో కూర్చుని ఏవో ఆట లాడుకొంటున్న పొరుగింటి ఆడ పిల్లలు యితడిని చూసి క్షణ మాత్రం తమ ఆటఆపి తిరిగి అందులో నిమగ్ను లయ్యారు. వంటయింట్లో పని చేసు కొంటున్న శారద అలికిడి విని ఇవతలి కొచ్చింది.

"ఇందాక ఆయన ఎవరో...."

ఆమె మాటల మధ్యలోనే ముందు గదిలో ఎవరో వున్నారన్నట్టుగా వివేకానందం సైగ చేశాడు.

శారద గొంతు తగ్గించి "....ఓఅర డజను ఆపిల్ పళ్ళు, ఓ డజను బత్తా యిలూ యిచ్చాడండీ" అన్నది చిరు నవ్వుతో.

"కొంచెం కాఫీ పెడుదూ, ప్లీజ్"

"అట్లాగే లెండి"

వివేకానందం మళ్ళా ముందుగది లోకి వచ్చాడు.

పది నిమిషాల తరువాత శారద కాఫీ తెచ్చేటప్పటికి వీళ్ళిద్దరూ ఏవేవో ఆఫీసు కబుర్లు చెప్పుకొంటున్నారు.

మరో పావుగంటతర్వాత బలరామ రెడ్డి వెళ్ళటానికి లేచాడు.

"ఇహ శలవు తీసుకుంటానండీ. ఏదో ఉడతా భక్తిగా యిది వుంచండి" అంటూ వివేకానందం చేతిలో అయిదు వదిరూపాయల నోట్లు పెట్టాడు బల రామరెడ్డి....

ఆతడిని సాగనంపి యింట్లోకి తిరిగి వచ్చినపుడు ఇందాక డి. డి. గారి ఇంటి పనులు చేసినప్పుడు పడ్డ మనోవ్యధ యిప్పుడు వివేకానందం మనస్సులో లేదు. జేబులో అయిదు పదులు వున్నా యన్న భావంతో అతడి మనస్సు ఆనంద లోకంలో స్వేచ్ఛా విహారం చేస్తోంది.

# 3

కొత్తగా వేసిన సర్కార్ ఎక్స్ ప్రెస్సులో డిప్యూటీడైరెక్టరు నాగరాజు, ఆయన క్యాంపు క్లార్కు వివేకానందం విజయవాడ వస్తున్నారు. డిప్యూటీ డైరె క్టరుకు స్వాగతం యివ్వటానికి జిల్లా అధికారి, వివేకానందానికి స్వాగతం యివ్వటానికి జిల్లా ఆఫీసు హెడ్ క్లార్కు స్టేషన్‌కు వచ్చారు.

ఫస్టుక్లాసు పెట్టెలోంచి నాగరాజు, ఆ పక్కనే మూడవ తరగతి లోంచి వివేకానందం దిగారు. పెట్టెలోంచి దిగిన వివేకానందం తనకు స్వాగతం యివ్వ వొచ్చిన హెడ్‌క్లార్క్ రత్న స్వామికి షేక్‌హ్యాండ్ మాత్రం యిచ్చి ఫస్టుక్లాసు పెట్టె దగ్గరికి పరిగెత్తాడు.

అప్పటికే నాగరాజు పెట్టెలోంచి దిగి జిల్లా ఆఫీసరు వెంకటరెడ్డిని ఏవేవో ప్రశ్నలు వేస్తూ నిల్చున్నాడు. వెంకటరెడ్డి వినయంగా డిప్యూటీ డైరె క్టరుగారికి అన్నీ వివరిస్తున్నాడు.

వివేకానందం రావటం చూసి "అవన్నీ, జాగ్రత్తగా కార్లో పెట్టించు

వివేకానంద్" అంటూ నాగరాజు ముందుకు సాగిపొయ్యాడు.

వివేకానందం ప్యాంటు జేబులోంచి డిప్యూటీ డైరెక్టరుగారి సామానుల లిస్టు తీశాడు. దాని ప్రకారం ఒక్కొక్కటీ లెక్కచూసుకొన్నాడు. అన్నీ వచ్చినట్లు నిర్ధారణ చేసికొన్నాక ప్యూన్లు సామాన్లు నెత్తిన పెట్టుకొని బయలుదేరారు....

వెంకటరెడ్డి స్వంత కారులో నాగరాజును కూర్చొబెట్టుకొని డ్రైవ్ చేస్తున్నాడు. వెనక సీటులో డ్రైవరు ముందుకి వంగి కూర్చున్నాడు. డ్రైవరు కదూ. వెనక్కి ఆనుకొని కూర్చోటానికి వీలులేదు మరి.

ఆ వెనకాలే టాక్సీలో డి. డి. గారి సామానూ, ప్యూనూ, జిల్లా ఆఫీసు ప్యూనూ, హెడ్‌క్లర్క్ రత్నస్వామి, వివేకానందం వస్తున్నారు.

ట్రావెలర్స్ బంగళాలో రెండు కార్లు ప్రవేశించగానే చెల్లా చెదురుగా కూర్చున్న బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు బిలబిలమంటూ లేచి నిల్చుని డి. డి. గారికి స్వాగతం చెప్పేందుకు వచ్చారు.

అందరి నమస్కారాలూ అందుకొంటూ డిప్యూటీ డైరెక్టరు కారులోంచి దిగాడు. దిగీ దిగటంతోనే ఆయన కళ్ళు ముందువరుసలోనే వున్న నరసింహమూర్తి మీద పడ్డాయి.

ఏమయ్యా ? ఈసారి నీ ప్రొగ్రెస్ రిపోర్టు అట్లా ఏడ్చినట్టుందేం ? ఉద్యోగం చేయాలని లేదా ?" అన్నాడు నాగరాజు.

నరసింహమూర్తి ముఖం గంభ

గొడ్డలి పెట్టి కొట్టినా నెత్తురు రానంతగా పాలి పోయింది. ఆ క్షణంలోనే తనను డి. డి. గారు సస్పెన్షన్‌లో పెట్టినట్టూ, తరువాత ఉద్యోగం పూడిపినట్టు ఏవేవో భయంకర దృశ్యాలు కళ్ళముందు కని పించటం మొదలు పెట్టాయి.

నాగరాజు మరేమీ మాట్లాడకుండా లోపలికెళ్ళాడు. ఆ వెనకాలే వెంకట రెడ్డి. ఆయన వెనకాలే వివేకానందం లోపలికెళ్ళాడు. డిస్ట్రిక్ట్ ఆఫీసు హెడ్ క్లార్క్ కాబట్టి రత్నస్వామికి లోపలికి వెళ్ళటానికి అధికారం లేదు!

మరో ఐదు నిమిషాలలో వెంకట రెడ్డి బయటికొచ్చి "మధ్యాహ్నంమూడు గంటలకు డి. డి. కాన్ఫరెన్సు ఏర్పాటు చేశారు. ఇక మీరు వెళ్లొచ్చు" అని ప్రకటించి లోపలికెళ్ళాడు.

నాగరాజు ఏ జిల్లాకు వెళ్ళినా బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరులు సమావేశం ఏర్పాటుచేసి అందరికీ అక్షింతలు వేస్తుం టాడు. అందరూ వచ్చి ఓపికున్నంత మేర అక్షింతలు స్వీకరించి "అమ్మయ్య యీసారికి గండం గడిచింది" అని బహిరంగంగా అనుకుంటూ "ఈడి. డి. గాడు ఎప్పుడు ట్రాన్స్‌ఫరు అయి చస్తాడోగాని...." అని లోపల దీవిస్తూ వెళుతుంటారు.

వెంకటరెడ్డి లోపలికివెళ్ళగానే ఎక్స్ టెన్షన్ ఆఫీసరులు చెల్లాచెదరుగా బయలుదేరారు. నలుగురైదుగురు మటుకు దిగాలు పడివున్న నరసింహ మూర్తి దగ్గరున్నారు. మరో నలుగురు హెడ్‌క్లార్క్ దగ్గరికి చేరారు....

మరో అయిదు నిముషాలలో వివేకా నందం బయటికొచ్చాడు. అతడిని చూడ గానే అందరూ అతడిచుట్టూ చేరారు. హెడ్ ఆఫీసునుంచి వచ్చాడు, పైగా డి. డి. గారి సి. సి. ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు!

"ఏమిటి సార్ ఎవరినన్నా ట్రాన్స్ ఫర్ చేస్తున్నారా?" "ఎవరికన్నా బొక్క పెడుతున్నారా చెప్పండి సి. సి. గారూ ?" "ఈసారి ప్రమోషన్ లిస్టులో డి. డి. గారుఎవరిని రికమెండ్ చేశారో చెప్పండి ప్లీజ్" "నేను నెల రోజులు ఎర్న్‌డ్ లీవుపెట్టేను. శాంక్షన్ అయిందండీ?" "నా ఎరియర్స్ బిల్ కౌంటర్ సైన్ అయిందండీ వివేకా నందంగారూ...."

అందరికీ అన్నిరకాల సమాధానాలు ఎవరికీ ఏ సంగతీ అందకుండా చెప్పే సరికి వివేకానందానికి మరొక పావు గంట పట్టింది. ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు ఒక్కరొక్కరే వెళ్ళారు. వెళ్ళేముందు 'వివేకానందం గారు ఒకసారి యిలా రండి' అనో "సి. సి. గారూ మాట" అనో యితడిని పక్కకు పిలిచి "ఇది వుంచండి" అంటూ ఎవరికి తోచింది వాళ్ళు పదో యిరవయ్యో, పాతికో చేతిలోపెట్టి పోతున్నారు....

ఆఖరుకు అక్కడ మిగిలింది ముగ్గురే. "డోన్ట్ వర్రీ నరసింహ మూర్తిగారూ డి డి. గారికి ఏదో చెప్పు కోండి...." అంటూ వివేకానందం అతడిని ఓదార్చ ప్రయత్నించాడు...

ఇంతలో ప్యూన్ వచ్చి "బాబూ

దొరగారికి గంట గంటకీ బాదం పాలుండాలంట. ఆ నరసింహాలు సెబుతుండాడు" అన్నాడు.

నరసింహమూర్తి తన వులెన్ ప్యాంటులో చేయిపెట్టి పదిరూపాయల నోట్ల కట్ట బయటకు తీసి అందులోంచి రెండు పదులు ప్యూనుకిచ్చాడు.

"గాంధీ ఐస్ పార్లర్‌లోంచి తీసుకురా. బాగుంటుంది" అన్నాడు.

విపరీతంగా లంచాలు పడుతుండటంవల్ల బ్లాక్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల చేతిలో డబ్బు పుష్కలంగా వుంటుందని వివేకానందానికి తెలుసు. కాని నరసింహమూర్తి జేబులో యింత పెద్ద పదిరూపాయల కట్టను చూసి ఆశ్చర్యపోయ్యాడు. రత్నస్వామికి యిదేమీ కొత్త కాదు. అతడు వీళ్ళ దగ్గర యింతకంటే పెద్ద కట్టలే చూశాడు....

"డి. డి. గారి క్యాంపుకు నేనుఎంతో ఖర్చు పెడితే ఏం? ఎన్ని ఏర్పాట్లు చేస్తేనేం? ఈసారి నాకు పనిష్మెంటివ్వక వదలరు ఆయన" అన్నాడు నరసింహమూర్తి, డి. డి. గారు క్యాంపు చేస్తున్న యీ రెండురోజులూ అన్నీ 'ఎరేంజ్' చెయ్యాల్సిన బాధ్యత యీసారి యితడి నెత్తిన పడింది—

ఇంతలో లోపలినుంచి వెంకటరెడ్డి బయటికొచ్చాడు. ఆయన్ని చూడగానే కాలుస్తున్న గోల్డ్‌ఫ్లేక్ సిగెరెట్టు అవతల పారేశాడు నరసింహమూర్తి.

"మిస్టర్ నరసింహమూర్తి జస్ట్ ఎ మినిట్" అని పిలిచాడు వెంకటరెడ్డి.

నరసింహమూర్తి గబగబా అటు వెళ్ళాడు. వాళ్ళిద్దరూ వరండాలో ఒక మూల నిల్చుని అయిదు నిముషాలసేపు మాట్లాడారు. ఆ తరువాత వెంకటరెడ్డి లోపలికి వెళుతూ "మిస్టర్ వివేకానంద్ యిహ మీరు డ్యూటీకి వెళ్ళండి. మళ్ళీ రెండు గంటలకు రమ్మని డి. డి. గారు చెప్పారు" అన్నాడు.

ఆ నరసింహమూర్తి వీళ్ళందరి దగ్గరకూ వచ్చాడు. "అదేమి సంగతి. డి. డి. గారు బిల్లు కట్టించే ప్రయత్నములో వున్నారట. దర్వాజాలకు వాటికి రెండు వేలు వెంటనే కావాలట. అది నన్నిచ్చుకోమని చెబుతున్నారు మన

బాస్, పైగా ప్రమోషన్ లిస్టుకూడా రికమెండ్ చేయకుండా ఆపారట డి.డి. గారు. నే నీ మనీ యిస్తే నా పేరు ఆ లిస్టులో యిరికించేటట్టు చేస్తామంటు న్నారు మన బాస్...." అన్నాడు మెల్లిగా రహస్యం బయటపెడుతున్నట్టు.

"మరేం చేస్తారు ?"

"ఏం చేస్తాను ? ఉద్యోగం వదులు కొంటానా ? ప్రమోషన్ పోగొట్టు కొంటానా ?"

# 4

విజయవాడలో డిప్యూటీ డైరెక్టరు గారి క్యాంపు పూర్తయింది. ఆయన యివ్వాళ సాయంత్రమే సర్కార్ ఎక్స్ప్రెస్‌లో గుంటూరు వెళ్ళాల్సి వున్నది. సాయంత్రం ఆరు గంటలకు సర్కార్ ఎక్స్‌ప్రెస్ వస్తుంది.

మధ్యాహ్నం నాలుగయింది. ట్రావెలర్స్ బంగళాలో డి. డి. గారి గదిలో ఆయన ఠీవిగా పేము కుర్చీలో కూర్చున్నాడు. ఆయన ప్రక్కనే వెంకటరెడ్డి కూర్చున్నాడు. నాగరాజుకు యిటువేపు వివేకానందం ఏదో ప్యాడ్ పట్టుకొని నిల్చున్నాడు.

"ఏడీ యీ ఫూల్ నరసింహమూర్తి ? ఇట్ యీజ్ ఆల్‌రెడీ ఓవర్" అన్నాడు నాగరాజు చికాకులో.

ఈ సాయంత్రం నాలుగు గంటల లోపుగా నరసింహమూర్తి రెండువేల రూపాయలూ తెచ్చి యిస్తానని చెప్పి.

---

★ లింకన్ ప్రభుత్వంలో ఒకసారి మంత్రిపదవి ఒకటి ఖాళీ వచ్చింది. సెనెటర్స్‌లో చాలామంది తమ తమ అర్హతలు వుదహరిస్తూ మెమొరాండాలు తీసుకు వచ్చేరు. వారందర్నీ కూర్చోబెట్టి యీ కథ చెప్పాడు లింకన్.

"అనగా అనగా వొక రాజు. ఆ రాజుకొక మంత్రి. రాజూ మంత్రి వొక నాడు వాహ్యాళికి బయలు దేరుతూ వుండగా ఒక చాకలి ఎదురు పడి ప్రభువు వారు అష్టేమారం వెళ్ళొద్దండీ; ఎందుకంటే వర్షం వస్తుంది; అన్నాట్ట. మంత్రిగార్ని సలహా అడగా అదేంలేదు; పదండి వెళదాం. అన్నాట్ట.

రాజూ మంత్రీ అలా కాసేపు వెళ్ళగానే వర్షం ప్రారంభ మైంది. ఇద్దరూ నిలవ నీడలేక ఎక్కడో చెట్టుకింద చిక్కుపడి తడిశారుట.

మర్నాడు ఆ చాకలికి కబురుచేసి నీకు వర్షం పడుతుందని ముందుగా ఎలా తెలిసింది? అని ప్రశ్నించేరుట, రాజుగారు. దాని కేముందండీ. మా గాడిద నడిగితే చెబుతుంది అన్నాట్ట చాకలి. గాడిద ఎలా చెబుతుందయ్యా అంటే ఆకాశం వేపు కాసేపు మోరఎత్తి చూసి, తిరిగి దించేటప్పుడు చెవులు టప టప లాడిస్తే వాన వచ్చేటట్టూ; ఊరికే దించేసి వూరుకుంటే వర్షం రానట్టూ అనిభాష్యం చెప్పెట్ట చాకలి. గాడిదకి తెలిసిన పాటి తెలియక పోయిందే అని మంత్రి మీద ఒకటే చిరాకు పడి, రాజుగారు మంత్రిస్థానే గాడిదని నియమించుకున్నారు."

"తరవాతేమైంది ? అన్నారు అభ్యర్థులు కుతూహలంగా.

"తరవాత యింకేముంది ! అప్పట్నించీ ప్రతి గాడిదా తనకి మంత్రి పదవి యిప్పించమని అడగడం పరిపాటై పోయింది !" అన్నాడు లింకన్.

వెళ్ళాడు. ఇంతవరకు రాలేదు. అందుకే డి. డి. గారికి విసుగ్గా వుంది.

"ఈ పాటికి వస్తూనే వుండాలి సార్" అంటూ వెంకటరెడ్డి కుర్చీ లోంచి లేచాడు.

ఇంతలో తలుపు తోసుకుని నరసింహమూర్తి ప్రవేశించాడు. అతడి ముఖమంతా చెమటపట్టి వుంది. అలసిపోయి వచ్చినట్టు కనబడుతున్నాడు.

"ఎక్స్క్యూజ్ మి సార్ ఆలస్యం అయింది" అంటూ నిల్చున్నాడు.

"హుం!" అన్నాడు నాగరాజు.

నరసింహమూర్తి ప్యాంటు జేబు లోంచి రుమాలుతో వున్న వందరూపాయల నోట్లకట్ట బైటకు తీసి, రుమాలును విప్పి ఆ రెండు వేలు డిప్యూటీ డైరెక్టరుగారి ముందున్న టీ టేబుల్ పైన పెట్టాడు.

నాగరాజు అవి తీసుకొని "హుం!" అన్నాడు. ఒకసారి ఆ నోట్లన్ని లెక్క పెట్టి "ఇవి దగ్గిరుంచు వివేకానంద్. గుంటూరు వెళ్ళాక తీసుకొంటాను" అంటూ యిరవై నోట్లూ యిచ్చాడు.

వివేకానందం అవి అందుకొని జేబులో పెట్టుకోబోయాడు. ఇంతలో తలుపులు హఠాత్తుగా తెరుచుకొన్నాయి. మామూలు దుస్తుల్లో వున్న ముగ్గురు వ్యక్తులు లోపలికి ప్రవేశించారు. అందులో ఒకతన్ని వెంకటరెడ్డి గుర్తుపట్టాడు. స్పెషల్ తహసిల్దారు రామయ్య చెట్టి!

ఆ ముగ్గురిలో ఒకతను ముందుకొచ్చి "మిష్టర్ నాగరాజ్. నేను అంటీకరప్షన్ డిప్యూటీ సూపరింటెండెంటును. మీరు లంచం తీసుకొంటున్నట్లు ఇన్ఫర్మేషన్ అందింది. ఏవీ ఆ రెండు వేలు" అన్నాడు.

నాగరాజు మొహం ఎట్లా మారిపోయిందో వర్ణించటం కేవలం అవివేకం. మరుక్షణంలో తెలివితప్పిపోయినా, గుండె ఆగిపోయినా ఏమీ ఆశ్చర్యంలేదు....

"ఏవీ ఆ నోట్లు?" అన్నాడు డిప్యూటీ సూపరింటెండెంట్ మళ్ళా.

వివేకానందానికి ఒక్కసారి ముచ్చెమటలు పోశాయి. చొక్కా తడిసిపోయింది. వణుకు పుట్టింది. కళ్ళు ముందూ అంతా అలుక్కు పోయినట్లుంది. యాంత్రికంగా నోట్లు తీసి బల్లమీద పెట్టాడు.

"ఓ క్యాంప్ క్లర్క్కు గూడా యిందులో వాటా వుందా?"

"అబ్బే అతడికేమిలేదు సార్. పూర్ ఫెలో" అన్నాడు నరసింహమూర్తి.

"ఓ ఐ సీ. కాని అతనూ వచ్చి స్టేట్మెంట్ యివ్వాలి. వెల్ లెట్ అజ్ మువ్" అన్నాడు.

కాని అప్పటికే వివేకానందానికి స్పృహ తప్పింది. నిల్చున్నవాడల్లా ధభీమని నేలమీద కుప్పగా కూలిపొయ్యాడు........

★★★

# కప్ప, గొప్ప



పచ్చికబయలులో ఎద్దు మేత మేస్తోంది. చెరువుగట్టునుంచి ఒక కప్ప ఎద్దును చూస్తున్నకొద్దీ దాని మనస్సు అసూయతో నిండిపోయింది. ఈ ఎద్దు యింత పెద్దదిగా ఎందుకుండాలి ? నే నెందు కింత చిన్నదానిగా వుండాలి ? అని వూరికే కుతకుత లాడిపోయింది. ఏమైనా సరే, ఎద్దుకంటె పెద్దదై పోవాలని దానికి దుర్బుద్ధి పుట్టింది.

బాగా గాలి పీల్చి పొట్ట ఉబ్బించింది. తన పక్కనున్న కప్పల నడిగింది. "ఇప్పుడు ఎద్దుకంటె పెద్దదాన్ని అయ్యానా లేదా ?" అని.

"లేదు" అన్నాయి మిగతా కప్పలు.

ఇంకా పొట్ట ఉబ్బించింది. ఎన్నిసార్లు అడిగినా మిగతా కప్పలు ఎద్దే పెద్ద దంటున్నాయి. ఆగ్రహం పట్టలేకపోయింది కప్ప. ఆఖరిసారిగా పొట్టను పెద్ద బంతిలా ఉబ్బించింది. అంతే. టప్పున పొట్ట పగిలిపోయింది.

ఎవరి అంతరమెంతో తెలుసుకోవాలి. లేనిపోని గొప్పలకు పోతే కప్పకు అయినట్టే అవుతుంది.




డి. కామేశ్వరి

"ఏనే లార్జ్ బి.కె." చీటీమీదరాస్తూ మెల్లిగా అన్నాడు రావు.

"సార్ యిప్పటికే చాల అయింది.. పన్నెండు దాటుతుంది.... "నసిగాడు ముక్త్యార్ అహమద్.

"షటప్! నేను చెప్పింది చెయ్యి!" చెయ్యాడించాడురావు. తాంగ్లో ముక్త్యార్ విషాదంగా, సానుభూతిగా నవ్వాడు.

గోడమీద స్కర్టింగ్పైన గ్లాస్ కేసులో ఉమర్ ఖయ్యాం రంగుల పెయింటింగు: గ్లాస్మీద రుబాయి ఒకటి చెక్కబడింది.

"నన్నడగకుండానే, నా యిష్టం తెలుసుకోకుండానే

ఎక్కడినించో ఇక్కడికి నన్ను తోసేశారు

నన్ను అడగనైన అడగకుండా ఈ లోకం నించి

ఎక్కడికిగెంటుతారో, గెంటేస్తారు.

సఖీ గిన్నె నింపు.

ఈ ధూర్తత్వాన్ని మరిపించేందుకు ఇంకో గిన్నె మధువు!"

ఇంగ్లీషు పద్యాన్ని గట్టిగా చదివాడు రావు. అంతా ఖాళీగావుంది. ఎక్కడా ఎవరూలేరు. బార్ముందు ఎత్తయిన గుండ్రని స్టూలుమీద కూర్చుని మరో గ్లాసు ఖాళీ చేశాడు.

"ముక్త్యార్! నీకో పాఠంచెపుతాను. శ్రద్ధగా ఒళ్ళు దగ్గిఱ పెట్టుకుని విను!"

"సార్!" ముక్త్యార్ యిలాంటి పాఠాలు చాలామంది దగ్గిఱ విన్నాడు. కాబట్టి తనపని తను చేసుకుపోసాగాడు.

"మన హృదయాలు ఎండిపోయిన నేల లాంటివి; బీటలు తీసేశాయి. యిక్కడ ఏ మొక్కా మొలవదు!"....

"అవును సార్!" ముక్త్యార్ అరలకి తాళాలు బిగిస్తూ పరధ్యానంగా అన్నాడు.

"ఎప్పుడో రెండో మూడో వాన చినుకులు పడుతాయి.... రెయిన్ డ్రాప్స్!.... చల్లబడుతుంది....హాయ్.. హాయ్!.... ఎంతహాయి!"

"కరెక్ట్ సార్!"

"కాని ఏం లాభం? మళ్ళా.... వాన వెలుస్తుంది.... ఎండ కాస్తుంది.... నీరింకి పోతుంది.... క్రితం సాయంకాలం పడ్డ చినుకులు ఎక్కడ అణగారిపోయాయో ఎవరికి పత్తా?"



"ఏం మిగలదు సార్!"

"అదే, జీవిత రహస్యం! అర్థమైందా?... నో, యీ సారి మార్పు కోసం, వన్ ఓల్డ్ స్మగ్లర్!"

"ఓల్డు స్మగ్లర్ అయిపోయింది సార్!"

"పోనీ బి. కె"

"అంతా పాత స్టాకు సార్. వాసన బాగులేదు!"

"ఇడియట్! ఎందు కంటున్నావో నాకు తెలుసు. కాని, నేనింకా గీత దాట లేదు. సర్లే! నువ్వుపో!" రావు దిగాడు స్టూల్‌ని రెండు మూతు రౌండ్లు తిప్పి.

"ఇప్పుడే వెళ్ళకండి సార్. కాసేపు ఆ సోఫాలో కూర్చోండి!"

"ఇక్కడ గాదు: వరండాలో!"

వరండాలోకి ఒక సోఫా లాగించాడు ముక్త్యార్.

"లైటు వెయ్యమంటారా సార్!"

"వద్దు, మిగతా లైట్లు కూడా ఆర్పెయ్యి! చీకటి బాగుంటుంది!"

బయట వెన్నెల కురుస్తోంది. గుండ్రంగా తిరిగే ఫౌంటెన్లు యింకా నీరు చిమ్ముతున్నాయి. సన్నగా పొడుగ్గా నీటి కాలన్లో తెల్లగా మబ్బుల నీడలు కదులుతున్నాయి. ఎక్కడో దూరంగా ఎలక్ట్రిక్ దీపాలు తెల్లని వెన్నెల్లో మచ్చల్లా వేలాడుతుంటే, ఎలెక్ట్రి సిటీ వాళ్ళమీద రావుకి చాలకోపం వచ్చింది. పాల వెన్నెల్లో యీ దీపాలవసరం ఏమిటి? అవి ఆర్పవచ్చుని వాళ్ళ కెందుకు తట్టదో! అనుకున్నాడు.

ఏమిటో అంతా చికాగ్గా వుంది. దేనిమీదో, ఎందుకో కోపం. మెదడంతా ఓ చిన్న సంచిలో పడేసి కుట్టేసినట్టుంది. ఆలోచన ఎటూ సాగడంలేదు. బండగా, మొద్దుగా తయారయింది. ఓ సారి మొగం చిట్లించి పిడికిలితో నుదుటి మీద గట్టిగా రుద్దాడు.

దట్టంగా కమ్మిన పొగ మంచు క్రొద్ది

గా విడినట్లయింది. ఆ పొగ మంచు మధ్య మసక మసగ్గా రత్నమాల కనుపించింది.

రత్నమాల తల దించుకొని కళ్ళు పై కెత్తి తనవంక బిడియంగాచూస్తూంది. పెదాలమీద. మనసులో ఆనందాన్నంతనీ కురిపించే చిరునవ్వు. అలాగే పరిచయమైంది మొదట క్లబ్‌లో.

"చెప్పాను కదూ ! ఈయనే రావుగారు !" మిసెస్ మూర్తి పరిచయం చేసింది ఒక రాత్రి ఎనిమిది గంటలకి.

"ఏం చెప్పింది !"

ఏమిటి చెప్పారు ? ఆ రహస్యం తెలుసుకోకపోతే యింక నాకు నిద్ర పట్టదు !"

"అది మాలో రహస్యం ! మీరడగకూడదు !" కొంటెగా నవ్వింది.

మ్యూజిక్ మొదలవగానే మూర్తి భార్య వంక చూశాడు. రాణి మూర్తి వంక, రత్నమాల వంకా చూసింది. రత్నమాల రావువంక,మూర్తివంక చూసింది.

చివరికి మూర్తి అన్నాడు.

"రావ్! రత్నమాలకి కంపెనీ ఇవ్వు నేనూ, రాణి ఒకసారి ఫ్లోర్ మీదికి పోయొస్తాం."

"రత్నా ! రావుగారితో మాటల్లో పడ్డావంటే నిన్ను నీవు మరచిపోతావు· జాగ్రత్త !" నవ్వి లేచింది రాణి.

రత్నమాల తల దించుకు కూర్చుంది మాట్లాడాల్సిన భారమంతా రావుమీదనే వేసి.

"మీరేం తీసుకుంటారు ?"

"నాకేం వద్దండి."

"మీకు కావాలావద్దా అని నేనడగో లేదు !" రావ్ ఆమెకళ్ళలోకి చూశాడు.

ఆ కళ్ళు తడబడుతున్నాయి. ఆమె పెదాలు నవ్వుతున్నా, ఆ కళ్ళలో ఏదో అంతులేని విచారం నీడలా తొంగి చూస్తోంది. కొందరికళ్ళు ఎప్పుడూ అలాగే వుంటాయి. ఆ కళ్ళంటే రావుకెంతో యిష్టం. ఆమె సంభ్రమాన్నీ. మొహమాటాన్నీ చూసి జాలిగా నవ్వుకున్నాడు రావు.

ఆ తర్వాత, తను స్కాచ్ తీసుకుని ఆమెకి కోకాకోలా అందించాడు. ఇష్టం లేదన్నట్టు పుచ్చుకుని పూర్తిచేసింది రత్నమాల. ఆమె క్రొత్తచోట క్రొత్త మనుష్యులమధ్య ఇమడలేకపోతూంది. చుట్టూ అంతా రకరకాల ప్రాంతాల వాళ్ళు, ఉన్నతోద్యోగులు; ఆధునికత ఉట్టిపడే వేష భాషల్తో అంతమంది ఆడవాళ్ళు. మగవాళ్ళ మధ్య ఆ వాతావరణంలో భయంకరమైన ఒంటరితనం ఆమెని బాధిస్తోంది.

"చూడండి. నేను కొద్దిగా కవిత్వం చెప్తాను. మీకు అదోలా బాధగా వుంటుంది. కాని అది బయటపెట్టక నా కోసం చిన్నగా నవ్వండి" ఆమెని కుదుట బర్చడానికి తేలిగ్గా మాట్లాడసాగాడు రావు.

"మీరు కవిత బాగా రాస్తారని చెప్పింది రాణి, నాకు పొయిట్రీ అంటే యిష్టం ! చెప్పండి నాకే బాధా లేదు ?"

"నేను కవిత చెప్తానంటే పారిపోకుండా నిలబడ్డవాళ్ళు మీరొక్కరు కనిపించారు. సంతోషం. చూడండి. యీ మనుష్యులంతా ఎవరో గొప్పవాళ్ళనీ మీకన్న పై మెట్టని అనుకోకండి. అంతా ఒకటే ఖాళీ మనుష్యులు! బుట్ట బొమ్మలు! గడ్డికుక్కిన సంచులు! తడారిన మన గొంతుకలు చేసే శబ్దాలు, గాజు గొట్టాల్లో గాలి కూతల్లా, పగిలిన పెంకులమీద ఎలక కాళ్ళ చప్పుళ్ళా, అర్ధరహితమైన ధ్వనులు! ఆకారాల్లేని రూపాలు! కదల్లేని శక్తులు!..."

"మీరు ఇలియట్‌ని అప్పజెప్తున్నారు!" దొంగని పట్టినట్టు సంతోషపడింది రత్నమాల.

"మీకు కవిత్వం అభిరుచే కాకుండా ప్రవేశంకూడా ఉందన్నమాట! ఎంత వరకు చదివారు?"

"బి. ఏ. అండి" మళ్ళీ సిగ్గుపడసాగింది.

"మీ మొహమాటం, బిడియం తగ్గించాలని నేను యిదవుతూంటే మీరు అలా ముడుచుకు పోతారేం? ఇక్కడికి వచ్చే మనుష్యులు ఆనందించాలని, కొన్ని గంటలు తమని తాము మర్చిపోవాలని వస్తారు. ఇక్కడకూడా మన అంతరాలు, హోదాలు, తేడాలు అన్ని గుర్తుంచుకుని బిగుసుకుపోతే యింకెలా? రండి, డాన్స్ చేద్దాం."

"నాకు అసలు బొత్తిగా రాదండి. ఎన్నడూ చూడలేదుకూడా" తడబడింది.

"మరేం పర్వాలేదు. ఎడం చెయ్యి నా బుజం మీద వెయ్యండి. కుడిచేత్తో నా ఎడం చేయి పట్టుకోండి. నాతోపాటు అడుగులు వెయ్యండి. అంతే! కమాన్!"

ఆమె తడబడ్తూ, తల వంచుకుని మెల్లగా లేచింది.

ఫాక్స్ ట్రాట్ వాయిద్యం వినిపిస్తూంది. రావు, ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి పట్టుకుని ఫ్లోరంతా ఒకసారి తిప్పాడు. రత్నమాలజీవితంలో అదొక క్రొత్త అనుభవం.

"నాతో డాన్స్ రాదని చెప్పారు. మోసమన్న మాట!" మూర్తి, రాణి దగ్గఱకి వచ్చినపుడు మూర్తి, రత్నమాల మీద నెపం వేశాడు.

"నేను చెప్పలా, ఆయన మాటల్లో పడితే ప్రమాదమని" రాణి నవ్వింది.

"మైండ్ యువర్ బిజినెస్! మీరు వాళ్ళ మాటలు వినకండి" రావు నవ్వుతూ రత్నమాలని మరీమూలకి చేర్చాడు.

బాండ్ ఆగింది, మళ్ళీ మొదలైంది. ఈసారి మరో బీట్! రత్నమాల ఏం చెయ్యాలో తోచని దిగ్భ్రమలో ఉన్నట్టు నిలబడి పోయింది.

"ఊఁ కానివ్వండి" రావు అన్నాడు.

"దయచేసి నా ప్రార్థన వింటారా? కాసేపు బయట వేరే కూర్చుని కబుర్లు చెప్పుకుంటే యింతకంటే హాయిగా వుంటుంది కదూ!" బెరుకుగా అంది రత్నమాల.

రావు ఆమె కళ్ళలోకి చూశాడు.

ఏదో వేదన, ఆరాటం, నిండి దిమ్మెర పోతగా కురియబోయే మబ్బుల్లాంటి పెదలు కమ్మినట్టున్నాయి. ఆ కళ్ళలో జాలి పుట్టించే దైన్యం అతన్ని కదిల్చింది.

"ఫర్వాలేదు, రండి" బయటికి లాన్ లోకి నడిచారు ఇద్దరూ. చెట్టు మొదట నీడలో పేం కుర్చీల్లో వాలారు.

"క్షమించండి. మీరు మామూలుగా అందరిలాగ క్రొత్తదనం ఫీలవుతున్నారేమోనని బలవంతం చేశాను. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం నా ఉద్దేశం కాదు!" రావు సంజాయిషీ చెప్పుకున్నాడు.

"మీరు నన్నేం బాధపెట్టలేదు.... నిజానికి."

"నిజానికి ?"

"నిజానికి యీ వూరు వచ్చాక చాల సహజంగా, శాంతిగా ఫీలయింది మీ ఎదుటనే !"

"ఏదన్నా పనిమీద వచ్చారా ?"

"లేదండి .... ఊరికేనే !" ఆమె తల ఎత్తలేదు. ఆమె దాస్తోందని, తనకి చెప్పడం యిష్టంలేదని రావుకి తెలుసు. బలవంతం చేయిలేదు,

రెండు రోజులు పోయాక—

ప్రొద్దునే రావు ఆఫీసులో అడుగు పెట్టిన అర్ధగంటకి ఫోన్ మ్రోగింది.

"రావ్"

"రావ్! మూర్తిని మాట్లాడుతున్నాను ఒక చిన్న విషయం."

"పెద్ద విషయమైనా వినడానికి చేయడానికి సిద్ధం !"

"రత్నమాలని చూశావుగా! ఆమెకి ఉద్యోగం కావాలి. నీ దగ్గిర ఖాళీ లున్నాయి గదూ !"

"రత్నమాలకి ఉద్యోగమా ? ఆమె ఊరికే చూడ్డానికి వచ్చిందనుకున్నాను"

"దానికోపెద్ద కథ ఉందిటలే నేను రాణి నడిగినాగాని తర్వాతెప్పుడో చెప్తానని దాటేసింది. ఆ గొడవ మన కెందుగ్గాని, నీ దగ్గిర ఖాళీలుంటే,కాస్త సహాయం చేద్దూ !"

"ఖాళీ ఉందిగాని, దానికి ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజినడగడం, వాళ్ళులిస్టు పంపడం అయింది. ఇంటర్వ్యూ తారీఖు కూడా ఫిక్సయింది."

"రావ్ ! బొత్తిగా అమాయకుడిలా మాట్లాడకు. నువ్వు చెప్పే కారణాలు నిన్ను అడ్డుకోవని నీకూ తెలుసు !" నవ్వాడు మూర్తి.

"ఇంతకీ ఆమెకి గుమస్తా ఉద్యోగమెందుకో ? ఒకసారి నేనామెతో మాట్లాడవచ్చా !"

"ఎలాగూ ఇంటర్వ్యూ అంటూ ఒకటుందిగా ?"

"ఆ ఇంటర్వ్యూకాదోయ్! నేనామెతో రెండుమూడు గంటలు ! హోటలుకో, సినిమాకో వస్తుందేమో అడుగు ?"

"రాకపోవటానికి ఏముంది ? నీకెప్పుడు వీలవుతుందో చెప్పు"

"రేపుఆదివారం, లంచ్, క్వాలిటీలో

తీసుకుని, ఆ తర్వాత వెస్టెండ్‌లో మార్చి! ఆమె నడిగి రింగ్ చెయ్యి మళ్ళీ!"

ఆ ఆదివారం మధ్యాహ్నం రెండు గంటలవేళ క్వాలిటీలో కూర్చున్నారు ఇద్దరూ. బయట ఎండకి విరుగుడన్నట్టు చల్లటి కాంతినిచ్చే దీపాలు, సన్నగా వాద్య సంగీతం. మెల్లగా గుసగుసలు తప్పించి పెద్ద శబ్దంలేని ప్రశాంతత.

"మీరు ఉద్యోగం చెయ్యాలను కోడం నా కాశ్చర్యం కలిగించింది."

"అంత ఆశ్చర్య పోవడాని కేముందండి?"

"చూడండి, యీ ఉద్యోగాలు, కాగితాలు, ఫైళ్ళు, పాడ్‌లు, పేపులు, గుండుసూదులు, జేక్లిప్పులు, ఇకానమీ ఫ్లాప్‌లు, 'యస్సార్'లు - యివన్నీ మనుష్యుల్ని మరలు చేస్తాయి. ఆ మోటపనికి మగాడే తగును! పూలు, వెన్నెల. మబ్బులు, లేచిగుళ్ళు, ఆడవాళ్ళు-యివన్నీ సౌందర్యం, సౌకుమార్యం, సున్నితం, లాలిత్యంలాంటి లక్షణాలకి ప్రతిరూపా లనుకుంటాను! వీటన్నింటిని ఉద్యోగాల విషజ్వాలలకు ఆహుతి చెయ్యడం ...."

"మీరు కవిత్వం చెప్తున్నారు!" రత్నమాల నవ్వింది.

"కావచ్చు కాని నా అభిప్రాయాలు కొన్ని మీకు చెప్పాలనే మిమ్మల్నిక్కడికి పిల్చాను కాబట్టి మీరు భరించాలి."

"ఏదో కాలక్షేపం క్రింద వినడానికి నా కభ్యంతరం లేదు."

"అంతేనా?"

"నా పరిస్థితి మీకు తెలియదు. నేను కేవలం ఉద్యోగం చేయాలనే ఆరాటంతో యింత దూరం రాలేదు. నన్ను పరిస్థితులు తరిమాయి!"

"అవి నేను తెల్సుకోవచ్చా?"

"క్షమించండి"

"దట్సాల్ రైట్. ఇంక నేను అడగను ఆ విషయం గురించి"

"మిమ్మల్ని కాదన్నందుకు నన్ను మన్నిస్తారు గదూ?" ఆమె ఇబ్బందిగా. నిస్సహాయంగా చూసింది.

"మీ కెందుకంత గాభరా? నేనేం అనుకుంటాను చెప్పండి!" ఆమాత్రం అర్ధంచేసుకోలే ననుకున్నారా? ఇంకా గొడవ మర్చిపొండి!" రావు నవ్వాడు.

"నిజంగా మీ సహృదయత చూస్తుంటే....మనసు విప్పి చెప్పుకోవాలని ఆరాటం కలుగుతోంది, కాని...."

"ఇంక ఆ గొడవ మరచిపొమ్మన్నాను గదూ! మీకు నా దగ్గిర పని చెయ్యడం అభ్యంతరం కాదనుకుంటాను!"

"అది మహాగౌరవంగా భావిస్తాను"

"అలా మాట్లాడకండి. పొగడ్తలు నన్ను ఇబ్బందిపెడ్తాయి. ఆఫీసు బయట నన్నొక మామూలు స్నేహితునిగా చూడండి!" రత్నమాల కళ్ళు కృతజ్ఞతతో నిండాయి.

ఆ తర్వాత ఎక్స్ఛేంజి పంపినవా

ళ్ళెవరూ పనికిరారని రాసి, మరొక లిస్టు పిల్చాడు రావు. ఈసారి లిస్టులో రత్నమాల పేరు వచ్చింది. రత్నమాలకి ఆ ఉద్యోగం వచ్చింది.

రత్నమాల ఉద్యోగంలో చేరాక, రావుకి తను కూర్చునే గది మరీ పెద్ద దనిపించింది ఆమె సీటు అక్కడ వేశారు.

ఉదయాన్నే ఆఫీసులోకి అడుగు పెట్టగానే రత్నమాల లేచి "గుడ్ మార్నింగ్ సార్!" అంటుంది. ఆ తర్వాత ఆ రోజు టపా టేబుల్ మీద వుంచి, సిగ్నల్స్, అవ్ యిమ్మీడియట్, ఇమ్మీడియట్, ప్రయారిటీ వగైరా తరగతుల ఉత్తరాల్ని వరుసగా అందిస్తుంది. వీటికి రావు యిచ్చే జవాబులు స్థూలంగా అర్థంచేసికొని డ్రాఫ్టు తయారుచేసి, అతని అంగీకారం తీసుకుని టైపు కివ్వడం ఆమె పని.

మొదట్లో రత్నమాలకి పని చాతగా లేదు. ఆఫీసు ఉత్తరాలని తనకి వచ్చిన భాష నంతనీ ఉపయోగించి రాయసాగింది. అందమైన భాష వాడితే రావు సంతోషిస్తా డనుకునేది.

"ఆఫీసు ఉత్తరాల్లో కావల్సింది అందమైన మాటలుగావు. స్పష్టంగా, తేలిగ్గా అర్థమయ్యే మాటలు; అది దృష్టిలో ఉంచుకోండి. మనస్సయిలు వేరేచోట వాడుకుందాం." ఒకసారి రావుచెప్పాక ఆమె మారింది. అతని శక్తిసామర్థ్యాలమీద ఆమెకి గొప్ప గౌరవం కలిగింది.

మొదట ఆమె అక్కడ కూర్చోవడం రావు ఆలోచనల్లో విడవకుండా వెంటాడింది. క్రమేపి ఆమె ఉనికికి అలవాటు పడ్డాడు అతను. ఆఫీసు నాలు గోడల మధ్య ఆమె అతని దగ్గిఱ అందర్లాగే పనిచేసే ఒక మనిషి.

రెండు నెలలు గడిచాయి.

ఒక మధ్యాహ్నం అతను లంచ్ కానిచ్చిన మరో పదినిమిషాలకి ఆమె టేబిలుముందు నిలబడింది. మొదట ఏదో మామూలు గొడవ అనుకుని కాసేపు తను చూస్తున్న కాగితం మీంచి దృష్టిమరల్చలేదు. అది చదవడం పూర్తి అయ్యాక.

"యస్"—తలెత్తి చూశాడు.

"నాకు సెలవు గావాలండి" అంది. తలవంచుకునే.

"సెలవా? ఎప్పుడు? గ్రాంటెడ్!"

ఆమె కాగితం అందించింది. అది చదవకుండానే దానిమీద 'గ్రాంటెడ్'

అని రాసేసి, "ఎందుకో తెలుసుకో వచ్చా ?" అని అడిగాడు.

"ఒక ఫ్రెండ్ పార్టీకిచ్చాడు. మధ్యాహ్నం వెళ్ళాలి. కొంచెం ఆఫీసునించి తొందరగా వెళ్తేగాని కష్టం"

"ఎవరా ఫ్రెండ్ ? పార్టీ ఎన్నింటికి ? ఏంపార్టీ ? ఎక్కడ- క్షమించండి మరీ వ్యక్తిగతమైన ప్రశ్నలడుగుతున్నట్టున్నాను !"

"అతనొక కాలేజీ స్టూడెంటు, కొన్నేళ్ళక్రితం పరిచయం అయింది. పేరు శ్యాంసుందర్. అతను కాలేజిలో దేనికో ఎన్నికయ్యాడు. అందుకు వాళ్ళ స్నేహితులందర్నీ పిలుస్తూ, నన్నూ పిల్చాడు. నాలుగున్నరకి ఫొటో, అయిదింటినించి ఆరింటిదాకా పూనమ్ రెస్టారెంట్‌లో రిఫ్రెష్‌మెంట్సు, ఆ తర్వాత ఎంపైర్‌లో సినిమా !... మీక్కావల్సిన వివరాలన్నీ యిచ్చాననుకుంటాను !" నవ్వింది రత్నమాల వేళాకోళంగా.

"కావల్సిన దానికన్నా యెక్కువే యిచ్చారు !" కాగితం ట్రేలోకి విసిరి ప్రక్కకి చూశాడు రావు.

అతను నవ్వకపోవడం ఆమెని బాధ పెట్టింది. అక్కడే నిలబడింది.

"మీరు వెళ్ళచ్చు. నిలబడ్డారేం ?" అతను మిగతా కాగితాలేవో చూస్తూ అన్నాడు. ఆ ముఖావానికి కారణం తన ప్రవర్తన వల్ల కలిగిన అయిష్టతో, లేక అతని పని బరువో తేల్చుకోలేక మరి రెండు నిమిషాలుండి —

"థాంక్యూ సార్ !" అని వెళ్ళిపోయింది రత్నమాల.

ఆమె వెళ్ళగానే, కాగితాలన్నీ దూరంగా నెట్టి, వెనక్కివ్రాలి, నిర్లిప్తంగా గోడకేసి చూశాడు.

ఆమె యెదట తన అయిష్టతని అంత స్పష్టంగా ఎలా వెలిబుచ్చాడు ! ఆమె తన గురించి ఏమనుకుందో? తన మనసులో భావం ఆమెకి అర్థం అయిపోయిందేమో? మనసంతా చికాగ్గా తయా తయారయింది.

ఎవరీ కాలేజి స్టూడెంట్ ! శ్యాంసుందర్ అతని పేరు' పార్టి, ఫొటో రిఫ్రెష్‌మెంట్స్, సినిమా. యింతేనా ! దీనివెనక ఏదో వుంది. ఆ 'ఏదో' తనకి తెల్సినట్లనిపించింది రావుకి. తన కాలేజీ రోజులు గుర్తుకువచ్చాయి. బాధ్యతా రహితమైన రోజులు. ఆలోచనలన్నీ ఆచరణలో పెట్టాలని వుంటుంది. పరిణామాలని గుర్తులో పెట్టుకోడం జరగదు.

శ్యాంసుందర్ ! పేరు బాగుంది. మనిషీ అంతేనా ? యేమిటో ఆ స్నేహం !

ఆ సాయంకాలం ఆమెని క్లబ్‌లో చూశాక మళ్ళా బయట ఎన్నడూ కలుసుకోలేదు. ఎన్నిసార్లో అడగాలనుకున్నాడు, ఏ సినిమాకో పిలవాలనుకున్నాడు. కాని అడగలేదు.

తనలో ఏదో అడ్డుపడింది. తను అధికారి. తన దగ్గిరఆమె పనిచేస్తోంది. తమ యిద్దర్నీ బయట చూసినవాళ్ళే

మమకుంటారు? పైగా ఆమె యిష్టాయిష్టాలెలా వున్నాయో? తన అధిక్యాన్ని అధికారాన్ని దుర్వినియోగ పరుస్తున్నట్టనుకుంటుందేమో! ఒకవేళ బలవంతాన వస్తే అందువల్ల తనకి ఒరిగేదేముండదు. ఏదో నేరం చేసినట్టు బాధపడ్డ మొక్కటే మిగులుతుంది.

ఈ రకం ఆలోచనల్లో సతమతమై ఏం చెయ్యలేకపోయాడు. పైగా రెండు నెలలు చాల తక్కువ వ్యవధి అనిపించింది తనకి.

రావుకి ఏమిటోలాగుంది ఆ సాయంకాలమంతా. చివరికి అయిదున్నర ప్రాంతంలో కాగితా లేవి చూడకుండానే లేచి వెళ్ళిపోయాడు.

లతీఫ్స్‌లో టీ త్రాగి బయటికి రాగానే రావుకో ఆలోచన వచ్చింది. వెంటనే ఎంపైర్‌కి పోయి టికెట్ తీసుకున్నాడు. ఇంకా ముప్పావుగంట పైముంది. దూరంగా స్టేషన్‌వైపు వెళ్ళిపోయాడు రావు.

ఆరున్నర కావస్తోంది. మరో రెండు మూడు నిమిషాలలో పిక్చరు మొదలవుతుందనగా గుమ్మం దగ్గర క్రీనీడలో నిలబడి హాలు కలయచూశాడు. క్రింది తరగతిలో ఒక మూలగా రత్నమాల. మరో అతను కూర్చున్నారు. ఇద్దరే! మిగతా అందరూ వెళ్ళిపోయారన్న మాట! లేక పార్టీ అంతా ఇద్దరేనా? వాళ్ళిద్దరూ మాటల్లో పడి అతని వంక చూడలేదు.

శ్యాంసుందర్ చామనచాయగా, బాగా పొడుగ్గా వున్నాడు. జాకెట్‌లాంటి చుక్కల టీ షర్టు. అతను మాట్లాడుతూంటే ఆమె శ్రద్ధగావింటూంది. ఒకోసారి నవ్వుతూంది. అదే నవ్వు నిర్మలంగా, ప్రశాంతంగా!

లైట్లార్పగానే,వాళ్ళకిసాధ్యమైనంత దగ్గరగా ఉన్న సీట్లో కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ సినిమాలో లీనమయ్యారు. రావు మనసు సినిమాలో లగ్నమవడం లేదు. ఏదో ఆందోళనగా ఉన్నాడు. ఆమె అతనివంక చూసినప్పుడల్లా రావు గుండెల్లో సూదులు గుచ్చినట్టుంది.

ఓ అర్థగంట ఆ నరకం అనుభవించాక, తనమీద తనకే చెప్పలేని అసహ్యం కలిగింది. తను చేస్తున్న పనేమిటి? ఈ గూఢచర్యకు ఏమి అర్థం? జెలసీ!"

"ఎన్నోసార్లు, తను లిఫ్టు యిచ్చి తీసికెళ్ళిన అమ్మాయిలు తనని వదలి యితరులడగానే డాన్స్‌కి వెళ్ళినప్పుడు తనేం బాధపడలేదు! పైగా అలాంటి బాధలూ, ఆ భావాలూ అనాగరికంగా, సభ్యతాసంస్కారాలు లేనివాళ్ళ మనః ప్రవృత్తిలాగ అనుకొనేవాడు! ఇప్పుడీ పసితనం ఏమిటి?

ఒకమూల తనలో రేగుతున్న బాధ వాళ్ళనింకా కనిపెట్టి చూడమని ప్రోత్సహిస్తున్నా, బలవంతానలేచి వచ్చేశాడు. ఆ రాత్రి బార్‌లో రెండు బాటిల్స్ గోల్డెన్ యీగిల్ త్రాగి గదిలోకి వెళ్ళి పడుకుంటే తెల్లారిపోయింది తెల్లారాక తనలా వచ్చేయడం చాలా మంచి పని అన్పించింది. క్రితం రోజు బాధ చాలవరకు తగ్గినట్టయింది.

ఆఫీసులో రత్నమాల క్రితంనాటి అతని ముభావాన్ని గుర్తుంచుకోనట్టే నడుచుకుంది. రావు చాల సహజంగా క్రితం సాయంకాలం లేనట్టే మాట్లాడాడు.

"మిస్! యీ సాయంకాలం మీ ప్రోగ్రాం ఏమిటి?" ఏదో కాగితం చూస్తూ మామూలుగా అడిగినట్టు అడిగాడు.

"ఏం లేదండి!"

"నాతో సాయంత్రం ఎక్కడికయినా రావడానికి అభ్యంతరం ఏమన్నా వుందా?"

"ఏమిటలా క్రొత్తగా మాట్లాడుతున్నారు?"

"క్రొత్తగాదు రత్నా! నీతో ఎన్నో రోజులనించి ఒకటి చెప్పాలనుకుంటాను. చెప్పలేక పోతున్నాను. నేను చెప్పింది ఒక అధికారి చెప్పినట్టు తీసుకుని, నీకిష్టం లేకపోయినా సరే ననేస్తావేమోనని భయం! ఎవరో స్నేహితుడు. చాల మామూలు స్నేహితుడు అడిగినట్టనుకో. నీ మనసులో ఏది వుంటే అది చెప్పు. నువ్వు కాదన్నా సరే, నేనేం అనుకోను!"

"మీతో రావడం, కులాసాగా కబుర్లు చెప్పుకోవడం, అన్నది నేను కలలుకనే తీయని అనుభూతి అనీ. దానికి విలువ లేదని. ఏంచెప్పి, ఏం చేసి మిమ్మల్ని నమ్మించగలనా అని ఆలోచిస్తున్నాను!"

"ఏమిటో, నా భావాన్ని సరిగ్గా చెప్పలేక పోతున్నాను. నువ్వు మరోలా తీసుకుంటున్నావు! ...మరీ అనుమానాల మనిషిగా కనపడుతున్నానా!" నవ్వాడు రావు

"మీరలా మాట్లాడితే నాకు చాల కష్టంగా వుంటుంది! నన్నెందుకు అర్థం చేసుకోరు మీరు?" నిస్సహాయంగా, బాధగా చూసింది రత్నమాల.

"ఫర్‌గెట్ యిట్. ఇప్పుడు నాలుగున్నర అయింది. నువ్వు వెళ్ళిపో. ఆరింటికి తయారుగా వుండు. నేను వచ్చి పిక్ చేస్తాను!"

"ఆరుగంటలకయితే యింకా చాలా టైముంది. ఇప్పటినుంచీ వెళ్ళక్కరలేదులెండి. అందరితోపాటే నేనూ వెడతాను!"

ఆ రాత్రి ఎనిమిది గంటల వేళ హోటల్లో కూర్చుని ఏదో ఆర్డరిచ్చాక మెల్లిగా అడిగాడు రావు.

"నీకప్పుడే స్నేహితులు దొరికినట్టున్నారే, ఊహల్లో!"

"స్నేహితులు అంటూ ఎందరో లేరు! మీకు తెలుసుననుకుంటాను. సుమతి అని 'బి' బ్రాంచిలో పని చేస్తోంది. ఆమె యింట్లోకి మకాం మార్చాను ఆమె చాలమంచిది. ముసలి తల్లి, యిద్దరు తమ్ముళ్ళు, ముగ్గురు చెల్లెళ్ళు, ఆ కుటుంబంలో నన్నూ ఒకరుగా కలిపేసుకున్నారు వాళ్ళు. శ్యాంసుందర్ ఆమె పెద్ద తమ్ముడు. ఇంటిదగ్గిర పరిచయమే. నిన్నేదో కాలేజి ఎలక్షన్‌లో నెగ్గాడట. వాళ్ళ క్లాస్‌మేట్‌లు, అబ్బాయిలు, అమ్మాయిలు ఒక డజనుమందితోపాటునన్నూ

పిల్చాడు. కాదనలేకపోయాను. తీరా హోటలునించి బయటికి రాగానే, సినిమాకి రామనికొందరు, యింతకు ముందే చూశామని కొందరు, ఇంటి దగ్గిర పెద్దవాళ్ళు కేకలు వేస్తారని కొందరు తప్పించుకున్నారు. నాకు తప్పింది గాదు. పదిగంటలకి గూటికి తిరిగి వచ్చాను!"

రత్నమాల చాల పెద్ద సంజాయిషీ యిచ్చింది. తన భావాలన్నీ ఆమెకి తెలిశాయా? తెలిసి. తనని నమ్మించాలని ఆమె ప్రయత్నిస్తోందా? రావు ఆలోచించాడు. ఆ చిక్కులు ప్రశ్నలు వేసుకొన్న కొద్దీ చిక్కుపడ్డం తప్పించి విడ్డంలేదు.

"నేనప్పుడప్పుడిలా పిలిస్తే ఏమనుకోవుగదూ!"

"నిజం చెప్పమంటారా?"

"ఊఁ!"

"ఈ రెండుమూడు నెలల్లో ఒక్కసారైనా మీరు పిలవలేదని నాకు చాలబాధ అనిపించింది తెలుసా! మన మిద్దరం ఒకేరకం అభిరుచులుగల వాళ్ళం. నాకెంతో మాట్లాడాలనుంటుంది. మీతో ఏదో చెప్పాలని, చర్చించాలని, రోజూ కనీసం ఓ గంట ఆఫీసు విషయాలు కాకుండా, ఏవేవో కబుర్లు చెప్పుకుంటే ఎంతో బాగుంటుందని ఆశపడ్డాను చాల సార్లు! కాని మీతో ఏమని చెప్పను? ఎలా చెప్పను? మీరు బాస్ కాకపోతే బహుశా, స్పష్టంగా చెప్పేదాన్నేమో!"

"మిస్!...." ఏదో చెప్పబోయాడు రావు.

"దయచేసి అలా ఆఫీసు ధోరణిలో పిలవకండి. ఇందాక పిలిచారే. అలా రత్నా అంటే సంతోషిస్తాను"

"సారీ.. రెండునెలలు అనవసరంగా వృధాచేశానుగదూ? నామీద యింత మంచి అభిప్రాయం ఉన్నందుకు నా కృతజ్ఞత ఎలా తెలుపుకోను చెప్పు."

"అలా అనకండి, ఇప్పటికే మీకు నేనెంతో ఋణపడి వున్నాను."

"ఆ ఋణం అలా ఎప్పటికీ పెరుగుతూండాలనే నా కోరిక. లేకపోతే...."

"లేకపోతే?"

"లేకపోతే నువ్వు దూరమైపోతావని భయం!"

రత్నమాల తలదించుకుంది. చాలసేపు మాట్లాడలేదు. రావుకి చాల తృప్తిగా వుంది. అతను చెప్పదల్చుకున్నది చెప్పేశాడు. ఆమె అర్థంచేసుకున్నట్లే మాట్లాడింది. ఆమె మాటల్లో అతనూహించని సామ్యం, అభిమానం కనపడ్డాయి. అంతకన్నా ఆమెనుంచి అతను కోరేదేం లేదన్నట్టనిపించింది.

ఆ తర్వాత సుమారు రెండు నెలలు, చాల సన్నిహితులయ్యారు యిద్దరూ. యించుమించు రోజూ బయట ఓ గంట గడిపేవారు.

ఒకరోజు ప్రొద్దునే ఆఫీసుకి రాగానే సీటులో రత్నమాల నిలబడి వుంది. టేబిల్ అంతా ఖాళీ. కాగితా లన్నీ నీటుగా పేర్చి ఉన్నాయి. పనేం ముట్టుకోనట్టు తెలుస్తోంది.

"మోర్నింగ్, రతన్ !" అతనే ముందు చెప్పాడు.

"గుడ్ మోర్నింగ్ సర్!" బొంగురు గొంతుతో, తలెత్తకుండానే అంది.

"ఏమిటా ఆలోచన ?" టేబుల్ దగ్గరే నిలబడి అడిగాడు.

చేతి క్రింద దాచిపెట్టిన గులాబీరంగు కాగితం ముందుకి తోసింది.

టెలిగ్రాం ! విప్పి చూశాడు రావు.

"జరిగింది మర్చిపో, నీ యిష్టమే జరుగుతుంది. అమ్మ చావు మంచం మీద ఉంది. వెంటనే రా ! - నాన్న."

"ఏమిటది ?" మొగం చిట్లించాడు రావు. ఆమె ఇంట్లోంచి ఎందుకు వచ్చేసిందో, ఉద్యోగంలో ఎందుకు చేరిందో అతను మర్చి ఎప్పుడూ అడగలేదు. ఆమె చెప్పలేదు.

రత్నమాల తల నింతా వంచుకొని మాట్లాడలేదు.

"ఇంటిదగ్గర తగువు పెట్టుకు వచ్చేశావా ? నాతో ఎన్నడూ చెప్పలేదే ? అసలు గొడవ ఏమిటి ?"

"నన్నిప్పుడేం అడక్కండి. చెప్పగలిగే స్థితిలో లేను. మరో రెండు గంటల్లో బండివుంది. నేను వెళ్ళాలి. నాకు శలవుకావాలి. కాదు. నేను రాజీనామా చేస్తున్నాను" రత్నమాల కళ్ళల్లో నీరు తిరుగుతుంటే తలప్రక్కకి తిప్పుతుంది.

"మూర్తికి వాళ్ళకి చెప్పావా ?"

"అసలు గొడవ రాణికి తెలుసు. ఈ సంగతి వాళ్ళకింకా చెప్పలేదు."

"నువ్విక్కడ వున్నట్టు యింటి దగ్గఱ తెలుసా ?"

"మొదట్లో తెలియదు. తర్వాత రాణి రాసివుంటుంది."

కాసేపు ఏదో కలలో వున్నట్టు విలబడ్డాడు రావు. ఏం చేయాలో తోచలేదు. అంతా గజిబిజిగా వుంది.

"సెలవు తీసుకో. రాజీనామా యెందుకు ?" రావు సందిగ్ధంగా అన్నాడు. "కాదు, నేవెళ్ళాలి. ఇంక యీ ఉద్యోగం చేయను."

"రండి, మొదట మూర్తివాళ్ళ యింటికి వెళ్ళి, ఆ తర్వాత మీ గదికి వెళాం." రావు సెలవురాసి హెడ్ క్లర్క్కిచ్చాడు. ఇద్దరూ రాణియింటికి వెళ్ళారు. మూర్తి ఇంట్లోలేడు.

టెలిగ్రాం చూసి రాణి నవ్వింది.

"నీ యిష్టం నెరవేరులోందిగా ! సంతోషించాలి. అంత బాధగా చూస్తావేం ! అమ్మ చావు మంచం ఎక్కడం నిజం అనుకుంటున్నావా ? వెర్రిపిల్లా ! నువ్వు వెంటనే వస్తావని అలా చిన్న అబద్ధం ఆడివుంటారు ! అంతే !"

"అంతేనంటావా ?" అనుమానంగా అడిగింది రత్నమాల.

"అవును, నాకూ అలాగే అనిపిస్తోంది. ఇంతవరకూ నకా ఐడియా రానేలేదు" రావుకూడా చెప్పాడు.

"ఏమైనా, నేను వెళ్ళాలి"

"బెస్టులక్ ! స్టేషన్‌కి వెళ్ళేటప్పుడు ఇలారండి. నేనూవస్తాను. ఈ లో ప ల నేను తయారవుతాను. అ ట్టే టై ం ఉన్నట్టు లేదు!" తొందరగా అంది రాణి.

కొద్ది సేపటికి....

గార్డు యీల వేశాడు. రైలు కూసింది. రత్నమాల నీళ్ళు చిందిన కళ్ళతో రావుకి బాగా పరిచయమైన చూపుతో చేతులు జోడించి అతనికేసి చూసింది.

"మీ ఋణం ఎప్పటికీ తీర్చుకో లేను!" గొంతు జీరపోగా, కృతజ్ఞతా భావంతో అంది.

"డోంట్ బీ సిల్లీ!" రావు అన్నాడు మెల్లిగా రత్నమాల చెయ్యి నొక్కి-విడిచిపెడుతూ.

రైలు కదిలింది. రత్నమాల వెళ్ళి పోయింది. ఇంటికి తిరిగి వచ్చేదాకా రావు ఏం మాట్లాడలేదు.

"కాసేపు మా యింట్లో కూర్చో కూడదూ? ఎలాగూ శలవు పెట్టిన ట్లున్నారు. ఇప్పుడింక ఇంటికి వెళ్ళి ఏంచేస్తారు? ఇవాళ ఇక్కడే భోంచేసి వెడుదురుగాని!" కారు దిగేముందు నవ్వుతూ అడిగింది రాణి.

"అంతకన్న యింకేం కావాలి?" దిగాడు రావు. ఇద్దరూ లోపలికి నడిచారు.

"ఇంతకీ రత్నమాల యింట్లోంచి ఎందుకు వచ్చేసింది? ఏమా కథ?"

"ఆమెనే అడగలేకపోయారా?"

"అడిగాను ఒకసారి. చెప్పలేదు. ఆఖర్న ఇవాళ మళ్ళీ అడిగాను. మిమ్మల్ని అడగమంది."

"కథేం లేదు. చాల మామూలు సమస్య" రాణి కళ్ళు, పెదాలు కొంటెగా నవ్వుతున్నాయి.

"ఏమిటది?"

"ముందు కాఫీ తాగండి, తర్వాత విందురుగాని తాపీగా!" రాణి కాఫీ కలిపి యిచ్చింది. రావులో ఉత్కంఠ ఎక్కువైంది.

"కథేం లేదు. అనగనగా ఒక అమ్మాయి. ఆ అమ్మాయి వాళ్ళ బావ చిన్నప్పటినించి ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకుని పెరిగారు. ఇద్దరూ కలిసి చదివారు. ఇద్దరూ ఒక రొకరూ ఎంతో అభిమానించుకుని. ప్రేమించుకున్నారు. ఇద్దరూ రంగు రంగుల కలలు కన్నారు వాళ్ళ భావి జీవితాన్ని గురించి. ఆ అబ్బాయి. ఈమెతోపాటే చదువు మానేసి ఉద్యోగం చూసుకున్నాడు. గారాల ఏకైక ముద్దులకుమార్తెకి, చదువుకున్న అమ్మాయికి, యింకా పెద్ద చదువులు, పెద్ద ఉద్యోగాలు వున్న అబ్బాయిని చూశాడు అమ్మాయి నాన్న. అమ్మాయి వాదించి ఏడ్చి రాగాలెట్టినా వాళ్ళ నాన్న

వినక పోవడంతో, అది భరించలేక స్నేహితురాలి దగ్గరకి వచ్చి ఆశ్రయం కోరింది. అక్కడొక దొరగారు ఆమెకి ఉద్యోగమిచ్చారు. ఈ లోగా స్నేహితు రాలు యింటికి నీతి బోధ చేస్తూ ఉత్తరం రాసింది. వాళ్ళ నాన్న మనసు కరిగింది. టెలిగ్రాం ఇచ్చి కూతుర్ని యింటికి పిలి పించుకున్నాడు. అమ్మాయి కలలు పండాయి. ఇవాళో రేపో వాళ్ళ బావని పెళ్ళి చేసుకుని మురిసిపోతుంది. కథ కంచికి. మంచి బహుమతి ఏదన్నా కొని తయారుగా వుంచుకోండి, పంపించ డానికి"_ తను చెప్పిన మాటల అందా నికి, ఆ నేర్పుకి మురిసి పోతున్నట్టు నవ్వింది రాణి.

మరో పది నిమిషాల కెలాగో తూర్పువి_

"క్షమించండి, ఇంకోసారి ఎప్పు డైనా వస్తాను!" అని లేచాడు రావు. రాణి ఏమిటేమిటో చెప్పి అతన్నాపాలని శత విధాల ప్రయత్నించింది. కాని రావు వినిపించుకునే స్థితిలో లేడు.

* * *

ఎలానో, ఎక్కణ్ణుంచో తనకి తెలియకుండా అకస్మాత్తుగా వచ్చి కొద్ది రోజులు తనని మురిపించి, వచ్చినట్టే, అంత తేలిగ్గానూ వెళ్ళిపోయింది! ఆమె కోసం తనకింత ఆరాటం, ఆందోళన ఎందుకు? తనని తాను మరచిపోయాడు.

మొదట్లో జాలి, సానుభూతి, తర్వాత దయ, అభిమానం, మధ్యలో అసూయ. చివరికి మమత, అనురాగం ఎన్నో రకాల అనుభూతులు తనని వశం చేసి కొన్నాయి! ఈ లక్షణాల నేమనాలి? ఇంత తేలిగ్గా ఈ ఇంద్ర జాలంలో యెలా పడ్డాడు?

వానచినుకులు భూమిని తూలాల్లా గుచ్చుతాయి. మచ్చ పడుతుంది. మరు క్షణంలో యింకిపోతుంది. మహా ఐతే గుంట పడవచ్చు. కాని ఈ గుర్తు లెంత కాలం వుంటాయి? ఈ సంఘటనలూ, వాటి జ్ఞాపకాలు అంతే. ఎప్పటికో అప్పటికి అన్నీ మట్టిగొట్టుకుపోతాయి. తనెందు కింత వ్యధపడటం?

వాచ్‌మేన్ కర్ర నేలమీద చేస్తున్న చప్పుడికి పూర్తిగా మెలకువ వచ్చింది రావుకి. ఒక్కసారి కళ్లు గట్టిగా చికి లించి చూశాడు.

బయట పండు వెన్నెల కురుస్తోంది. దూరంగా హెడ్జింగ్ దగ్గర తెల్లటి పూలు విచ్చి మెరుస్తున్నాయి. వల యాలు చుట్టుతున్న ఫౌంటెన్లు ఆగిపో యాయి. పిట్టేదో అరిచింది.

"ఐ యామ్ ఎ బ్లడీ ఫూల్!" గట్టి గా అనుకుని లేచాడు రావు.

వాచ్‌మన్ సెల్యూట్ చేశాడు.

***



# పెద్దా చిన్నా

ఒక ఎద్దు పచ్చికబీడులో మేతమేస్తోంది. ఈగ ఒకటి దానిచుట్టూ కాసేపు తిరిగి తిరిగి, కొమ్ముమీద వాలింది. కాని వెంటనే ఇలా అంది.

"ఇదుగో చూడండి, ఎద్దుగారూ ! మీకు బరువనిపిస్తే చెప్పండి. ఇంకో చోటికిపోయి ఆడుకుంటాను."

ఎద్దు "పరవాలేదు, ఆడుకో. నామీద వాలినా, మానినా ఒకటే. అసలు నువ్వు నా మీద వాలినట్టు నువ్వు చెప్పేదాకా నాకు తెలియదు" అంది.

అల్ప బుద్ధులకు అతిశయ మెక్కువంటారిందుకే.




విహారి & శాలివాహన

"అబ్బ, పోనూ, నువ్వు చెప్పేది అరిటాకూ - ముల్లూ సామెతేగా ?"

"నా మాటంటే నీకెంత చులకనగా వున్నా, చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదని మాత్రం మఱచిపోకు."

"ఛాదస్తపు సామెతలూ ఛాదస్తపు మనుషులూ."

"అవునే నీ కిప్పుడన్నీ ఛాదస్తంగా కనపడతయ్. అనుభవంలో కొచ్చి అల్లాడితే గాని తెలీదులే.

★ ★ ★

"రేణూ, నీ ప్రవర్తన నాకుబొత్తిగా నచ్చలేదు."

"పోనీ...."

"ఏమిటా పెంకి సమాధానం ?"

"ఇంకేం చెప్పనూ ?"

"నువ్విలా విచ్చలవిడిగా తిరగటం బాగాలేదు."

"ఎవరికి ?"

"అందరికి....ముఖ్యంగా నాకు. కనపడ్డ ప్రతి వెధవా నిన్ను గురించి అదోలా మాట్లాడటమే."

"అది వాళ్ళ సరదా...."

"ఇది.... ?"

"నా సరదా !"

"అంటే నువ్వు నీ ప్రవర్తనని మార్చుకోలేవా ?"

"లేనని కాదు. మార్చుకోవలసిన అవసరంలేదు. మనలో కల్మషం లేనప్పుడు మార్చుకోటం దేనికి ?"

"అయితే సరే ... ఉట్టి కట్టుకుని ఊరేగు. ఈసారెవరైనా నిన్ను గురించి ప్రశ్నిస్తే, నాకూ దానికీ ఏ సంబంధమూ లేదు దాని విషయమేదీ నన్నడగకండని చెప్పేస్తా"

"అది బుద్ధిమంతుడి లక్షణం"

* * *

"రేణూ, యిది నీకు తెలుసా ?"

"ఏమిటీ ?"

"నిన్ను గురించి మన వాళ్ళంతా చెవులు కొరుక్కుంటున్నారు"

"కొరికించుకున్న వాళ్ళ నందర్నీ జనరల్ హాస్పిటల్లో ఔట్ పేషంట్లుగా చేరమని ఉచిత సలహా యివ్వు."

**కొత్త సీరియల్**

"ఏమిటీ, మరీ చిత్రంగా మాట్లాడావ్ ? ఆఫీసంతా గగ్గోలు పుడుతుంటే నీకు చీమ కుట్టినట్లన్నా లేదేం ?"

"నాకు కాదే. వాళ్ళకు కుట్టాయేమో చీమలు. లేకపోతే గగ్గోలెందుకు పెట్టారు."

"నీతో మాట్లాడటం నాదేనే బుద్ధి తక్కువ."

"అయినా, నాకు నువ్వు చెప్పేదాని విటీ ! మాలీ అని వో మగ గొంతు పిలిస్తే ఆ షాక్‌తో ఆర్నెల్లు జ్వరం పడే దానివి."

"అవున్లే. మాకు నీ అంత ధైర్యమెలా వస్తుంది ? వస్తా."

అమ్మ—

అన్నయ్య—

మాలతి— భలేవాళ్ళు !

తనలో తను నవ్వుకుంటున్న రేణుక వుండబట్టలేక గొల్లున పైకే నవ్వేసింది.

"ఏమండీ. రేణుకాదేవిగారూ. ఎందుకో నవ్వుతున్నారు"

రేణుక ప్రక్కకి తిరిగిచూసింది. కాళిదాసు కాలర్ సరిచేసుకుంటూ, టేబుల్ మీదకి వంగి ఆమెవైపు చూసేడు. కాళిదాసు మాటల్లో ఒక చమత్కృతి వుంది. ప్రతిదాన్నీ మధ్యలో చిత్రంగా విరిచి పసిపిల్లవాడిలా మాట్లాడతాడు. ప్రత్యేకించి క్రియల్లో గ్రాంధికాన్ని పలకటం అతనికి బాగా అలవాటు.

రేణుక జవాబు చెప్పింది. "అమాయకులు కొందరు గుర్తుకొచ్చారు."

"ఈజిట్ ? అయితే ఆ లిస్టులో నేనూ ఉండేవుంటాను."

"ఏం ? మీరు అమాయకులా ?"

"అవునని గర్వంగా చెప్పగలను. కావాలంటే సర్టిఫికెట్ కూడా చూపించగలను."

మాలతి సన్నగా నవ్వి అంది. "అక్ఖరలేదు లెండి. మీరు మాత్రం నాకు గుర్తుకు రాలేదు."

కాళిదాసు చిన్నబుచ్చుకున్నాడు.

రేణుక తనపనిలో నిమగ్నమైంది.

ఆమెనేదో అడగాలని ప్రయత్నించాడే గాని అడగలేకపోయాడు కాళిదాసు.

కాళిదాసు అడగాలని తపనపడే విషయమేమిటో గ్రహించక పోలేదు రేణుక.

"వేణుమాధవ్‌ని రేణుక ప్రేమిస్తున్నదా ?" ఈ సందేహాన్ని గురించి తీవ్రంగా ఆలోచించి తేల్చుకోలేక నదరు అనుమానాన్ని 'నిజం' చేసుకోవటంకోసం తనను తాను కొంచెం ప్రైవేట్ డిటెక్టివ్‌గా నియమించుకున్నాడు కాళిదాసు. ఆ ప్రయత్నంలో రేణుకను కొన్నాళ్ళనుంచి ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు.

కోపంతో కూడిన చిరాకుతో విసురుగా వెనక్కి తిరిగిన కాళిదాసుకు నవ్వుతూ ఆవైపే వస్తున్న వేణుమాధవ్ కనిపించాడు. నిప్పులో ఒకిలో నెయ్యి పోసినట్లయింది. మొహం

న్ని 'సీరియస్‌గా' గా పెట్టి బూట్లు టక టక లాడించుకుంటూ వెళ్ళిపోయాడు.

కాళిదాసు ప్రవర్తనకి సన్నగా నవ్వుకుంది రేణుక. ఇంతలో వేణుమాధవ్ ఆమె ప్రక్కకు వచ్చాడు. అతని రాకను గమనించినా తన పనిలో మునిగి అతన్ని పలుకరించలేదు రేణుక. వేణుమాధవ్ ఆమె గీస్తున్న ప్లాన్‌వైపు నిశితంగా ఓక్షణం చూసేడు.

"రేణుకాదేవిగారూ, ఓ చిన్న మనవి."

రేణుక చక్రాల్లాంటి తన కళ్ళను ఇంకా పెద్దవిచేసి అతనివైపు చూసింది.

"మీరు వేసిన ప్లాన్ ప్రకారం ఈ బ్రిడ్జి కన్‌స్ట్రక్టు చేస్తే ఏడాదిలో కొట్టుకుపోతుంది."

రేణుక ఆశ్చర్యపోయింది. తను తయారుచేసిన ప్లాన్‌ని ఒకసారి చూసింది. దానిలో లోప మేమిటో ఆమెకేమీ అర్థంకాలేదు. అంతలో రఫీమని అనేసింది. "మా బాస్ చెక్‌చేస్తాడుగదా ఇలా ఎందుకు కన్‌స్ట్రక్ట్‌చెయ్యనిస్తాం?"

వేణుమాధవ్ నవ్వేశాడు. రేణుకా నవ్వింది. ఒక్క క్షణమైన తర్వాత అన్నాడు వేణుమాధవ్.

"మనపై వాళ్ళెప్పుడూ ఫండమెంటల్ మిస్టేక్స్ పట్టుకోలేరు.వాళ్ళ దృష్టి వాటిమీద వుండదు. చూడండి. ఆ ఎబట్‌మెంట్ డిజైను లెక్కలు ఒక్కసారి చెక్ చేయండి."

రేణుక ఆ కాగితాలని ఫైల్లోనుంచి పైకి తీసి పరీక్షచేయసాగింది. ఎంత పేపు గమనించినా తప్పు దొరకలేదు. సాలోచనగా వేణుమాధవ్‌వైపు చూసింది.

అతను వాటిని తీసుకుని, ఒకచోట పెన్సిలుతో గుర్తుపెట్టి "ఇదిగో ఈ ప్రెషర్ కాల్‌క్యులేషన్సులో పప్పులో కాలేశారు సరిచేయండి" అన్నాడు.

రేణుక నవ్వుతూ "నాకు వంట గదిలోకి వెళ్ళే అవసరం లేదులెండి" అంది.

వేణుమాధవ్ విషయం మారుస్తూ అడిగాడు.

"మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. సాయంత్రం పార్కుకు పోదామా?"

"రోజూ కార్యక్రమమేగా అది. దానికి వరమెందుకు?"

"థాంక్యూ." అని వెళ్ళిపోయాడు వేణుమాధవ్.

వేణుమాధవ్ రేణుక టేబుల్ దగ్గరికి పోయి అలా మాట్లాడటం, మధ్య మధ్య యిద్దరూ నవ్వుకోవటం ఇవన్నీ చెవులు నిక్కపొడుచుకునీ, కనురెప్ప లార్పకుండా గమనిస్తున్న సహోద్యోగులంతా వేణుమాధవ్ ఆ ప్రక్కకు రావటంతో తడబడి, తమతమ కాగితాలలోకి తలలు దూర్చేరు. వేణుమాధవ్ సన్నగా నవ్వుకుంటూ తన ఛేంబర్సులోకి వెళ్ళిపోయాడు.

వేణుమాధవ్ వెళ్ళిపోయిన తర్వాత తన సీట్లోనుంచి నెమ్మదిగా లేచి రేణుక దగ్గఱికి నడిచింది మాలతి.

"ఏం మాల్తీ. ఏదో కూపీతీయటానికి

బియలేరావ్ :" మాలతిని చూస్తూనే అడిగింది రేణుక.

మాలతి మూతి ముడుచుకుంది. "కూపీ తీసినా నువ్వే. కొంపలు తీసినా నువ్వే సమర్థురాలవని మనవాళ్ళంతా అనుకుంటూనే వున్నారు."

రేణుక కోపంతో వూగిపోయింది. "మాల్తీ :"-అరిచింది.

"ఎందుకే అంతకోపం. అదిసరే. నన్ను మాటమాటకీ 'మాల్తీ' శాల్తీ' అని పిలవొద్దన్నానా లేదా ? ఇదుగో అమ్మాయ్ ! ఈసారలా పిలిచావా మా బాస్‌తో చెప్పి ఉరిశిక్ష వేయిస్తా"

రేణుక ముఖం మళ్ళీ కోపంతో ఎఱుపెక్కింది. "మళ్ళీ ఆ మాటన్నావంటె నీ నోరు కుట్టేస్తా జాగ్రత్త. ఛా. ఛా. ఏం మనుషులో ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిరాదు."

మాలతి కొంచెం దెబ్బతింది. రేణుక అనవద్దన్న మాటలని ఆమె మనస్సును కష్టపెట్టానే అని బాధపడింది. తన దృష్టిలో బాస్‌చేత ఉరిశిక్ష వేయిస్తాననటే మళ్ళీ తాను కట్టేస్తానని. తొలిసారి తానీ మాటన్నప్పుడు రేణుక ఎంతో బాధపడింది. మళ్ళీ తనవద్ద అలా మాట్లాడవద్దని ఆవేదనతో వార్నింగ్ ఇచ్చింది. అయినా తనీవేళ తొందరపడి మళ్ళీ అదేమాట అన్నది.

మాలతికి ఏం చెయాలో తోచలేదు. "అయామ్‌సారీ రేణూ" బాధగా అని అక్కడినుంచి కదిలింది మాలతి.

"మాల్తీ" రేణుక పిలిచింది.

మాలతి వెనక్కి తిరిగి నిలబడింది.

"ఇలారా"

మాలతి వెళ్ళింది. రేణుక ప్రక్కగా నిలబడి ఆమె కళ్ళలోకి చూసింది.

ఇంతమంది ఆఫీస్ స్టాఫ్‌లో నువ్వన్నా నన్నర్థం చేసుకుంటావనుకున్నాను...."

"పొరపాటయిపోయింది రేణూ ! ఈసారికి మన్నించు వస్తా !" మాలతి మాట్లాడలేకపోయింది. భారంగా కదిలి వెళ్ళిపోయింది.

విషణ్ణ వదనంతో కూర్చుని ఆలోచనలో మునిగిపోయిన రేణుకను, భారంగా కదిలిపోయిన మాలతిని చూసి ఒకళ్ళ మొహాలొకరు చూసుకున్నారు మిగిలిన ఆఫీస్ సిబ్బంది.

* * *

"మధురాంతకం రాజారాం కథలన్నా, మాగాయి పచ్చడన్నా నాకు భలే యిష్టం."

"అభిరుచుల్ని గురించి మీతో వాదించటం నా కిష్టంలేదు."

"ఎందుకనీ ?"

"వాదించి నెగ్గలేను గనుక."

"మీరు వట్టి పిరికివారు."

"కావచ్చు ..."

"కావచ్చేమిటి మళ్ళీ... అవును... లేకపోతే అభిరుచుల్ని గురించి మాట్లాడలేక పోవడమేమిటి ? అసలు నన్నడిగితే ఆ వాదనద్వారానే అవగాహన ఎక్కువౌతుందంటాను."

"నేను మిమ్మల్ని బాగానే అవగాహన చేసుకున్నాను."

"అయితే మీరు పప్పులో కాలేశారన్నమాటే...." గల్లున నవ్వింది రేణుక.

వేణుమాధవ్ ఆమెవైపు అదోలా చూశాడు. "నా మాట నాకే వప్ప చెప్తున్నారే."

"బదులుకు బదులు పాలసీ నాది"

వేణుమాధవ్ సన్నగా నవ్వాడు. రేణుక దీర్ఘంగా నిట్టూర్చింది. "అమ్మయ్య. మిమ్మల్ని తేలిక పరిచే సరికి నా తలప్రాణం తోకకొచ్చిందంటే నమ్మండి. అయినా ప్రతి విషయానికీ యింత భయపడి బాధపడితే ఎలాగండీ"

"మీ కేం మీరెన్నైనా చెప్తారు. బాధంతా నాకేగదా"

రేణుక మళ్ళీ నవ్వింది. "అది నేననవలసిన మాట. నానాటికీ ఆడవాళ్ళ మనస్తత్వం పట్టుబడుతున్నదే మీకు."

వేణుమాధవ్ ఆశ్చర్యపోయాడు. విశితంగా రేణుక కళ్ళలోకి చూస్తూ అన్నాడు. "కుండలు బ్రద్దలు కొట్టేస్తారే మీరు"

రేణుక తేలిగ్గా నవ్వేసింది. "అదో జబ్బు. కానీ. ఇంతకి ఏదో ముఖ్య విషయమంటిరే ఏవిటది ?

"మనల్ని గురించి యింతగా వ్యతిరేక ప్రచారం ప్రారంభం కావటం నాకు చాలా బాధ కలిగిస్తున్నది."

"ఓస్ .. యిదేనా?రోజూవున్నదేగా క్షణంక్రితం మనం కారు దిగేటప్పుడు జరిగిన విషయానికేనా మీ రిలా బాధపడటం? అతనికేం తెలుసు పాపం.. మీ ఫ్రెండ్‌గదా, ప్రక్కన నన్ను చూసి ఏవనుకుంటాడు చెప్పండి. విష్‌యు బెస్ట్ ఆఫ్ లక్ అన్నాడు అంతేగా. ఇంతలో మునిగిపోయిందేమీలేదు లెండి."

వేణు మాధవ్ బొంగురుపోయిన గొంతుతో అన్నాడు. "మీకు తెలీదు. రేణుకాదేవిగారూ! మిమ్మల్ని గురించి వాళ్ళంతా అలా మాట్లాడుతుంటే నాకెంతో విచారంగా వుంది. స్త్రీ పురుషులు స్నేహితులుగా మసలే స్థితి ఎప్పటికొస్తుందో మన సంఘంలో. మీరు నాకన్నా పెద్దవాడు. మిమ్మల్ని నేను గౌరవించటం తప్పా? చెప్పండి. దాన్ని వీళ్ళంతా ఎందుకిలా రంగు కళ్ళతో చూస్తారు?"

అతని కళ్ళలో తిరిగిన నీటిని గమనించిన రేణుక ఆశ్చర్యపోయింది. తేలిగ్గా తీసేసింది నవ్వుతూ. "నే నన్నది అక్షరాలా నిజం. చూడండి మీ రెలా ఆడపిల్లలా కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నారో సారూ—మీకో ఆఫీసుకు అధికారి కదా, ఇలా బెంబేలు పడతారేమండీ?"

వేణుమాధవ్ కర్చీఫ్‌తో కన్నీళ్ళు తుడుచుకున్నాడు. కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

రేణుక అడిగింది, మౌనాన్ని భంగపరుస్తూ. "మన కథ కంటిన్యూ చేద్దామా, ఇవాళ్టికి వద్దా?"

"వేణుమాధవ్‌కి రేణుకను చూస్తుంటే ఆశ్చర్యం వేస్తోంది. ఊళ్ళోవాళ్ళు, ఆఫీసులోవాళ్ళు, ఇంట్లోవాళ్ళు — ఎంత

మంది తనను గురించి ఏవేవో అంటు న్నా ఆమె పట్టించుకోదేమా ? ఇంత నిబ్బరం ఎలా అబ్బిందీమెకు. అనిపి స్తోంది.

"ఏమండోయ్ ! మిమ్మల్నే. కథేమన్నా చెప్తారా లేదా ?"

వేణుమాధవ్ తెప్పరిల్లుకున్నాడు. "ఆఁ ఆఁ చెప్తానండి ..." అంటూ పచ్చికలో వాలేడు.

"చెప్పండి మరి" అని చుట్టూ చూసింది రేణుక.

వేణుమాధవ్, తనూ మొదటిసారి ఇక్కడ కూర్చుని ఇలాగే మాట్లాడు కోవటం ప్రారంభించగానే, ఎవరో పోకిరీ కుర్రాడు తమ ప్రక్కగా వెళ్తూ వెళ్తూ "నేనూ వినొచ్చా ప్లీజ్ !" అని పళ్ళికిలిస్తూ పరుగెత్తుకుపోయాడు. వెంటనే వేణుమాధవ్ లేచి వెళ్ళి అతన్ని పట్టుకుని దగ్గరకు తీసుకొచ్చాడు. 'రా బ్రదర్ ! కూర్చుని నువ్వూ విను.' అని అతన్ని తన ప్రక్కన కూర్చోమనేసరికి బిక్కచచ్చిపోయాడు ఆ కుర్రాడు. పాపం కుక్కిన పేనులా మనిషి కొయ్యబారి అలాగే కూర్చుండి పోయాడు. వేణుమాధవ్ చెప్పిన కథంతా విని కన్నీళ్ళు పెట్టుకుని క్షమాపణ వేడుకుని వెళ్ళిపోయాడు.




ఈ సంఘటనగుర్తుకొచ్చిన రేణుక పెదవులమీద చిరునవ్వు విరిసింది.

"ఏం, నవ్వుతున్నారు ?"

"అహఁహఁ ఏంలేదు. మన స్టోరీ ఫ్రెండ్ గుర్తుకొచ్చాడు, కాసింది."

వేణుమాధవ్ సన్నగా నవ్వి మొదలెట్టబోయాడు.

"హల్లో రేణుకాదేవిగారూ, మీరిక్కడ యుంటిరా ?" అన్న కాళిదాసు పిలుపుకు ఆవైపు చూశారు రేణుక, వేణుమాధవ్.

రేణుక, ప్రక్కనే వేణుమాధవ్ ఉండటం గమనించిన కాళిదాసు ముఖం ముడుచుకున్నాడు. బెరుగ్గా వేణుమాధవ్‌వైపు చూస్తూ "షికారుకని యిలా వచ్చాను" అన్నాడు కాళిదాసు.

రేణుక వేణుమాధవ్ నవ్వేరు.

"ఏం కాళిదాసుగారూ ! బాస్‌కి సంజాయిషీ ఇస్తున్నారా ? ఇది ఆఫీసు కాదు."

రేణుక మాటలకి కాళిదాసు రోషంగా వేణుమాధవ్ కళ్ళల్లోకి చూస్తూ తనలో తను ఏదో గొణుక్కున్నాడు

మాధవ్‌ను తన బాస్‌గా అంగీకరించ లేదు కాళిదాసు. 'దానికి కారణం అతని అహంభావం' అంటుంది రేణుక. కాళిదాసు సర్వీసు ఎక్కువ. రేపోమాపో వస్తుందనుకుంటున్న ప్రమోషన్ నిరంతరం పోస్టుపోన్ అవుతూ ఉండటం వలన అందరికీ అతనంటే కొంత తేలిక

భావం. అతను మాత్రం తనకు ప్రమోషన్ వచ్చినట్లే భావించుకుంటూ 'మాధవ్' ని తనతో సమంగా చూస్తూ వుంటాడు 'అతని సంతృప్తి అతనిది' పోనీలెమ్మంటాడు వేణుమాధవ్. ఈ కారణాల వలనే మాధవ్‌ని 'బాస్' అని అంటే చాలు, చిరాకు పడతాడు కాళిదాసు. అతన్ని ఉడికించ దలచుకుంటే చాలు ఆ మాటంటూ వుంటుంది రేణుక.

"ఇది ఆఫీసు కాదని అందరూ గుర్తుంచుకొనవలెను" అన్నాడు కాళిదాసు.

ఆ మాట తన నుద్దేశించి అన్నాడని తెలుసుకోకపోలేదు వేణుమాధవ్. అదే భావాన్ని పైకి వెలిబుచ్చుతూ అన్నాడు.

"కూర్చోండి కాళిదాసుగారూ, ముగ్గురం కాలక్షేపం చేద్దాం."

"మీ కాలక్షేపానికి మధ్యలో నేనెందుకులెండి. వస్తా" అంటూ కదలబోయాడు కాళిదాసు.

రేణుక అతనివైపు అదోలా చూసి "నిజమేలే. వెళ్ళిరండి. పానకంలో పుడకలా మీ రెందుకిక్కడ" అంది.

కాళిదాసు ముఖం మాడిపోయింది. కోపమూ వచ్చింది. "రాచకార్యా లుండే పెద్దమనుషులు...."

"రేణుకకు అతని మాట నేసరికి రోషమొచ్చింది. కొంచెపు బుద్ధిని నిరూపించుకున్నారు గానీ, పోయిరండి" అంది.

మరేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు కాళిదాసు

అతన్ని ఏహ్యంగా చూస్తూ "మంచి మూడ్‌ను కాస్తా చెడగొట్టాడే...." అని మాధవ్ వైపు చూసింది రేణుక.

వేణుమాధవ్ ఏదో ఆలోచిస్తూ పడుకుని వున్నాడు. "ఏవండీ, ఏమిటి ఆలోచిస్తున్నారు ?" రేణుక అడిగింది.

"ఏంలేదండీ ! కాళిదాసు మనిద్దర్నీ ఎందుకలా కనిపెట్టి వున్నట్టా అని."

"అతని కదో రకమైన సరదా. మన మీద నాలుగు కట్టు కథలు కల్పించి రేపు ఆఫీసులో నలుగురికీ చెప్పి ఆనందిస్తాడు. అదీ అతని తత్వం. అతని కదో ప్లెజర్ !"

వేణుమాధవ్ పెదవి విరిచి "అంతే అనుకోవాలి" అంటూ లేచాడు.

"ఇవ్వాల్టికి కథ ఆగిపోయినట్లేగా" రేణుక నిరుత్సాహంగా అడిగింది.

"చీకటి పడింది. రేపు కలుసుకుందాం వెళ్దామండీ !" అంటూ కదిలేడు వేణుమాధవ్.

"సరే పదండి" అంటూ కారు దగ్గరికి అతన్ననుసరించింది రేణుక.

## 2

"రేణూ !"

హాల్లోకి అడుగు పెట్టగానే అమ్మ పిలిచిన పిలుపుకు అదిరిపడి ఎదురుగా ఉన్న అన్నయ్య మొహంలోకి చూసింది రేణుక.

"నేనూ పిలుస్తూంట. ఎక్కణ్ణుంచీ రావటం ?"

సౌభాగ్యమ్మ కంఠస్వరం అతి కఠినంగా వుండటం గమనించి నెమ్మదిగా జవాబిచ్చింది రేణుక, తల వంచుకుని.

"ఆఫీసు నుంచే"

చెల్లెలి సమాధానానికి సన్నగా నవ్వుకున్నాడు రఘు.

"ఆఫీసు వదిలి మూడు గంటలైంది. నువ్వేమో ఆఫీసునుంచే వస్తున్నానంటావ్. ఏమిటీ తిరుగుళ్ళు? పోనీలే, ఏదో పసిది, దాని ముచ్చట నేనెందుకు కాదనాలని ఉద్యోగంలో చేరనిస్తే నువ్వు చేసే నిర్వాకం యిదా? అసలు ఆడదానికింత...."

తల్లి మాటమధ్యలోనే అందుకుని అన్నాడు రఘు..... "అదిరిపాటు తగదని నువ్వెప్పుడో చెప్పావ్. వింటేనా!"

"ఆఁ వినదు, వినదు. నాకసలు కోపమొచ్చిందంటే...."

"పెళ్ళి చేసేస్తావ్ కదే అమ్మా"

రఘు సౌభాగ్యమ్మ వాక్యం పూర్తిచేసి పెదవులమీద మందహాసంతో రేణుక కళ్ళల్లోకి చూశాడు. రేణుక మూతి మూడు వంకర్లు త్రిప్పి రఘు వైపు కోపంగా చూసింది. సౌభాగ్యమ్మకు ఏదో ఆలోచన వచ్చింది. "వెళ్ళిస్నానం చేసిరా. నీతో మాట్లాడాలి" రేణుకనుద్దేశించి అని లోపలికి వెళ్ళింది.

తల్లి అలా వెళ్ళగానే రుసరుసా రఘు ముందుకు వచ్చి అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది రేణుక. "అమ్మను నువ్వే కదూ పుసికొల్పింది. ఉండు నీ పని చెప్తా."

చేతిలో ఉన్న స్టెతస్కోప్ ను త్రిప్పుతూ సన్నగా నవ్వేసేడు రఘు.

"ఆవిడసలే నామీద కారాలు మిరియాలూ నూరుతుంటే...."

"నేను మాత్రం ఏంచేశాను? కాస్త అల్లం కూడా తగిలించాను. అంతేగా" రఘు నవ్వేడు.

రేణుక చిరాకుపడింది. కోపంగా అన్నది. "సర్లే కానీండి, మీ యిద్దరూ కలిసి నన్నేం చేస్తారు? ఉద్యోగం మాన్పిస్తారు అంతేనా? ప్రస్తుత పరిస్థితుల్లో నా కది చాలా మంచిది."

రఘు ఆశ్చర్యపోయి ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు. ఆమె మాటల్లోని అంతర్యాన్ని పసికట్టేడు. "అమ్మాయ్! నీ సంగతి నాకు తెలుసుగానీ, నిన్ను ఉద్యోగం మానేయమనేం శాసించం మేము, తెలుసా?.... పెద్ద ప్లాన్ వేస్తున్నావే. నువ్వు ఉద్యోగం చేసినా చెయ్యక పోయినా, ఇక ఆగేది లేదు. నీకు.... నీకు పెళ్ళి చేసెయ్యాల్సిందే.

"పెళ్ళి.... పెళ్ళి.... పెళ్ళంటే మహా ఉబలాటపడుతున్నావ్. అంత మోజుగా వుంటే చేసుకోరాదూ? నా పెళ్ళిసంగతి నీ కెందుకూ?" అని విసురుగా లోపలికి వెళ్ళింది రేణుక. చెల్లెలి మాటలకు సిగ్గుపడి తనలో తను నవ్వుకుని ఆమె వెళ్తున్నవైపు చూస్తుండి పోయాడు రఘు.

సౌభాగ్యమ్మ ఫలహార పళ్ళెంతో హాల్లోకొచ్చేసరికి రేణుక కూడ స్నానం చేసి డ్రెస్ ఛేంజ్ చేసుకుని అక్కడికి

వచ్చికూర్చుంది. సౌభాగ్యమ్మ వెనగ్గా వంటావిడ కాఫీ కప్పుల ట్రేని బల్లమీద పెట్టి వెళ్ళింది.

తల వంచుకుని మౌనంగా ఉప్మా తింటున్న రేణుక నుద్దేశించి అన్నది సౌభాగ్యమ్మ. "నిన్ను గురించి నలుగురూ ఏమనుకుంటున్నారో తెలుసా?"

తలెత్తి తల్లివైపు సాలోచనగా చూసింది రేణుక.

"నలుగురూ అనుకునేదాన్ని మరో నలుగురు చెపుతూనే వున్నారు."

రేణుక పెంకె సమాధానానికి దెబ్బ తింది సౌభాగ్యమ్మ. రఘుకు కోపం వచ్చింది.

"అమ్మాయ్, అమ్మ చెప్పేదాన్ని సీరియస్‌గా విను. ఇవేమీ పరిహాసాలకి మాట్లాడుకునే మాటలు కావు." అన్నాడు.

రఘు చెప్పిన తీరును గమనించిన రేణుకకి తలెత్తటానికి కూడా ధైర్యం చాలలేదు. మౌనంగా కూర్చుండి పోయింది. రఘు అంటే రేణుకకి ఎంత చనువున్నదో, అతను గట్టిగా మాట్లాడితే అంతకంత భయమూ వుంది. రేణుకంటే తనకెంత ప్రేమా ప్యాయతలూ అభిమానం వున్నా, ఆమె యెడల కాఠిన్యానికి వెనుదీయని తత్వం రఘుది. ఒకరి తత్వం మరొకరికి అవగాహన కావటం వలన అలాంటి వాతావరణాన్ని కలుషితం చేయరు ఇద్దరూను.

సౌభాగ్యమ్మ మొదలెట్టింది.

"ఆడపిల్ల పదిమంది మొగపిల్లలతో పాటు చదువుకోవటమంటేనే అబ్బురం మా కాలంలో. ఆ రోజులు పోయాయి కనుక చదివించాం. ఆ చదువులోనూ ఏ ఆడపిల్లా చదవని చదువు చదవాలని మొండిపట్టు పట్టినప్పుడే నే నెంతో చెప్పాను. గారాబం కొద్దీ మీ నాన్న నీ మాటనే 'సరే' అన్నారు కదా. లేకపోతే యింజనీరింగేమిటి ఆడపిల్లలకి? పోనీలే. సరదాకి చదువుకుంటున్నది లెమ్మనుకుంటే, తీరా ఆ చదువు పూర్తికాగానే ఉద్యోగం చేయాల్సిందేనని భీష్మించుకు కూర్చుంటివి. నీకు వీడి వత్తాసు. ఇక నేనేం చెప్పి మాత్రం ప్రయోజనమేం వుంది? భగవంతుడి దయవలన ఈ జన్మకి మనం తిని వంద మందికి పెట్టే అదృష్టం కలిగింది కదా, మనకీ ఉద్యోగా లెందుకంటే వినకుండా ఉద్యోగంలో చేరితివి. మాట నోరు దాటితే ఊరు దాటుతుందన్నారు; ఆడది గడప దాటితే....? సౌభాగ్యమ్మ ఆగింది.

రఘు ఆమె కల్పించ దలచుకున్న సామెతకి సన్నగా నవ్వుకున్నాడు. రేణుకైతే పైకే నవ్వి అన్నది. "ఆ సామెతే లేదుగానీ, బాధపడక నీ స్పీచ్ కంటిన్యూ చెయ్యి."

సౌభాగ్యమ్మ కూతురు వైపు రుసరుసా చూసి అన్నది. "ఉద్యోగం మానేసెయ్"

రేణుక రఘువైపు 'చూశావా' అన్నట్లు చూసి ఎగిరి గంతేసింది. "ఓ యస్. అందుకు నే నెప్పుడూ సిద్ధమే"

"ఎందుకమ్మాయ్! ఉద్యోగం మానేసి షికార్లు తిరగటానికి, స్వాతంత్ర్యం

గ్రూప్‌తో ఊతకొట్టటానికి. సిలోన్ రేడియో గిరబోయేదాకా వినటానికీ. నా కేమాత్రం తీరిక దొరికినా కాంట్రాక్టు బ్రిడ్జీ ఆడమని నా ప్రాణం తీయటానికీ. సిద్ధం కదూ నువ్వు ?"

"మహా ఘనత వహించిన అన్నయ్యగారూ మరొకటి మర్చిపోయారు. ఇప్పుడు క్రికెట్ టెస్టు జరుగుతున్నయ్ ఆ కామెంటరీ వినటానికీ...." అని ఒక్క క్షణం ఆపి అంతలో ఏదో గుర్తు చేసుకుని "ఆఁ ఆఁ తమ హాస్పిటల్లో కార్యక్రమాల్ని సూపర్‌వైజ్ చేయటానికీ...."

సౌభాగ్యమ్మకు వాళ్ళ ధోరణి నచ్చక కుర్చీలో విసుగ్గా మసిలింది. అందరూ కాఫీ పూర్తిచేశారు.

"చూడు రేణూ! శంకరం బావంటే నీ అభిప్రాయ మేమిటి ?" అడిగింది సౌభాగ్యమ్మ.

రేణు ముఖంలోకి ఆదుర్దాగా చూశాడు రఘు. ఆమె సిగ్గుపడింది. సమాధానం చెప్పకుండా క్రీగంట తల్లిని చూసింది.

"చెప్పు రేణూ ఎందుకు, సందేహిస్తావ్ ?" రఘు అన్నాడు.

"చదువు పెద్దగా లేకపోయినా లోకజ్ఞానం కలవాడు, బుద్ధిమంతుడు. అన్నిటికీ మించి మీ నాన్నగారి కోరిక శంకరాన్ని అన్యాయం చేయవద్దని. ఆయన మనస్సులోమాట మీ యిద్దర్నీ భార్యాభర్తలుగా చేయాలని. దానిని నెరవేర్చటం నా ధర్మంకూడా. ఏమంటావ్‌రా రఘూ ?"

"అవునమ్మా, మనకంటే చదువులో, ధనంలో తక్కువవాడైనా శంకరమంటే రేణుకు గౌరవం, అభిమానం వున్నాయని నా వుద్దేశ్యం. ఏం రేణూ" అన్నాడు రఘు.

"పల్స్ రీడింగ్‌తోపాటు థాట్ రీడింగ్ కూడా వచ్చే, డాక్టరుగారికి" అని నవ్వుతూ చెంగున లోపలికి వెళ్ళిపోయింది రేణుక.

"ఇంతకీ దాని మనస్సులో వున్న మాటను చెప్పదేంరా ? ఎలా ఛస్తాం. తీరా వాడిని పిలిస్తే నగుపాటు చేసిన వాళ్ళ మవుతాం" అన్నదిసౌభాగ్యమ్మ.

"అదేం లేదులేవే నీదో ఛాదస్తం"

"మరి ఆ మాధవ్ నెవర్నో యిది" సందేహంగా అడిగింది సౌభాగ్యమ్మ.

"అంతా వట్టిది, రేణూ ఎలాంటిదో మనకు తెలీదూ ? చూసి రమ్మంటే కాల్చి వస్తుంది మొదట్నుంచీ దాని కే విషయంలోనూ బెరుకులేదు. అందుకని అతనితో కలిసి తిరుగుతూ వుండొచ్చు. ఆ విషయాన్ని గురించి మన మేమీ బెంగపెట్టుకో నక్కరలేదు."

"అయితే పెళ్ళికి అమ్మాయి వొప్పుకున్నట్టేనా ?"

"అనే నా నమ్మకం."

సౌభాగ్యమ్మ కళ్ళు ఆనందంతో మెరిసినై. "ఏమో బాబూ. అదసలే పెంకి ఘటం. ఆ తర్వాత ఏ గలభా చెయ్యకుండా వుంటే సరి. శంకరానికి ఉత్తరం రాసి పిలిపించు. ఎలాగోలా దాన్ని ఓ యింటిదాన్ని చేస్తేగాని నా భారం తీరదు.

"అలాగే కానీ, నే నాస్పటలికి పోయొస్తాను" అంటూ వెళ్ళిపోయాడు రఘు.

రఘు వెళ్ళిన కొద్ది సేపటి వరకూ సౌభాగ్యమ్మ అలాగే కుర్చీలో కూర్చుని ఆలోచించసాగింది. ఆమె మనసులో ఎన్నెన్నో ఆలోచనలు- రేణుకని గురించి శంకరాన్ని గురించి, రఘును గురించి- తిరగసాగినై, శంకరం తమ యింటికి వచ్చిన సంఘటన, అతని చదువు ఆగిపోవటం అన్నీ గుర్తుకువచ్చినై సౌభాగ్యమ్మకు.

★ ★

41 "శంకరం ! శంకరం !"

లక్ష్మీపతిగారు ఆదుర్దాగా పిలిచారు.



ఎకౌంటు పుస్తకాల్ని తిరగేస్తున్న శంకరం లక్ష్మీపతిగారి పిలుపు విని వెంటనే వచ్చాడు. టేబులు దగ్గరగా నిల్చుని లక్ష్మీపతిగారి వైపు వినయంగా చూశారు.

"ఇదేమిటి బ్యాంక్ బేలన్స్ ఇదేనా"

"అదే మావయ్యా!"

"ఎందుకని?"

"కలెక్షన్స్ ఇంకా రాలేదు."

"ఆశ్చర్యంగా వుందే! డిశంబరు కలెక్షన్సు మూడ్నెల్లయినా రాలేదా?"

"రాలేదు. కొంతమంది యిదిగో పంపుతామని రాశారు. మరికొందరు సరుకింకా అమ్ముడు పోలేదని రాశారు. ఇవాళే మళ్ళీ అందరికీ 'రిమైండరు' పంపేను."

"ఊఁ. ఇలాగైతే అయినట్లే." అంటూ చూస్తున్న పుస్తకాన్ని మూసి వేశారు లక్ష్మీపతిగారు.

ఆరడుగుల పొడుగు, తగినంత లావూ వుండి ఖద్దరు పంచె, లాల్చీతో విండుగా కన్పిస్తారు లక్ష్మీపతిగారు. కళ్ళజోడు వెనకాల నుంచి నిశితమైన దృక్కులు ఆయన వ్యాపారానుభవాన్ని చాటుతాయి. పండిన గుబురు మీసాల చాటున నుంచి సన్నని చిరునవ్వు మాటిమాటికీ కన్పడి ఎదుటివాళ్ళకు ధైర్యం కలుగజేస్తుందిగాని, లేకపోతే ఆయన స్వభావం పూర్తిగా తెలియని వారు ఆయన ముందు ధైర్యంగా మాట్లాడలేరు. గత కొన్ని నెలలుగా వ్యాపారం మందగమనాన్ని సాగిస్తున్న దని ఆయన గ్రహించారు. అయితే అందుకు కారణం మాత్రం ఆయనకు వూహ కందటంలేదు. ఒక సంవత్సరంగా ఆయన వ్యాపారానికి సంబంధించిన అన్నివిషయాల్నీ పూర్తిగా శంకరం అజమాయిషీ మీద, గుమస్తాల మంచితనంమీద వొదిలేశారు. అందుకు కారణంకూడా లేకపోలేదు. కాలగమనంతో వార్ధక్యం వడివడిగా ముంచుకొస్తూంది. తానుండగానే శంకరానికి పూర్తి తరఫీదు నిచ్చి అతడు అన్నిటినీ నిర్వహించుకుంటుంటే చూసి తృప్తిగా తనువు చాలిద్దామని ఆయన కోరిక. తనవాడు అని చెప్పుకోతగ్గవాడు, తగుమాత్రం జాగ్రత్త గలవాడు, తన మేలు కోరేవాడు ఒక్క శంకరమే ఆయనకి కన్పించాడు. రఘు తప్ప. రఘు కాలేజీలో ఎం. ఏ. చదువుతున్నాడు.

శంకరం లక్ష్మీపతిగారి చెల్లెలి కొడుకు. తండ్రి చిన్నతనంలోనే చనిపోతే తల్లే సర్వమూ అయి పెంచి, పెద్ద చేసింది. వసంతకి తగుమాత్రం సంబంధం చూసి పెళ్ళిచేసింది ఆవిడ. వసంత అత్తగారింటికి వెళ్ళే సరికి ఆవిడకి నరిపోయే అప్పు మాత్రం మిగిలింది. ఆడపిల్ల పెళ్ళి చేయటంతోటే తన బాంధవ్యం తీరిందనుకున్నదో ఏమో, ఆ సంవత్సరమే ఆ తల్లి కన్ను మూసింది.

శంకరం ఇంటర్మీడియట్‌తోటే ఆగిపోవలసివచ్చింది. అప్పులకు, ఆస్తికి సరిపెట్టి, మావయ్య దగ్గరకు బయలు దేరి విజయవాడ చేరాడు శంకరం. లక్ష్మీపతిగారు వ్యాపారంలో బాగానే సంపాదిస్తున్నాడని అందరూ అనుకునేవారు.

ఆయన సాయంతో చదువు ముగించుకుని చిన్న ఉద్యోగ మేదైనా సంపాదించుకోవాలని శంకరం అనుకున్నాడు. తమ బాంధవ్యాన్ని పురస్కరించుకుని మావయ్య అంతమాత్రం సాయంచేయక పోతాడా అని అనుకున్నాడు శంకరం అయితే, ఆశయంమాత్రం నెరవేరలేదు. అతని చదువు అంతటితోనే ఆగిపోయింది.

ఆ సంవత్సరమే రేణుక ఇంటర్లో చేరింది లక్ష్మీపతిగారు, సౌభాగ్యమ్మ తమకిష్టం లేకపోయినా, కూతురు మాటకు ఎదురు చెప్పలేక పోయారు ఆమె మీది గారాబం కొద్దీను. మంచి తెలివితేటలతో, చక్కని మార్కులతో చదివే రేణుకి తానింకా పైకి చదువుతానంటే కాదంటానికి తగిన కారణాలు చూపలేక పోయారు, తల్లీ, తండ్రీ, అన్న రఘుకూడా.

కుమార్తెను కాలేజీలో చేర్పించి తననాశ్రయించిన శంకరాన్ని కాలేజీలో చేర్పించక పోవటంతో లక్ష్మీపతి గారు కొందరి విమర్శలకు గురి అయ్యారనే చెప్పాలి. ఏలకొక విధంగా అనుకున్నారు రేణుకకూడా తండ్రికి చెప్పి చూసింది. లక్ష్మీపతిగారు నవ్వి వూరుకున్నారు.

లక్ష్మీపతి గారి ఉద్దేశ్యమేమిటో శంకరానికి బోధ పడలేదు. ఆయన వుద్దేశ్యమేదైనా, తన ఆశయం నెరవేరలేదు కాబట్టి ఇక అక్కడ తను వుండటం అనవసరం మనిపించింది. ఒకరోజు లక్ష్మీపతిగారి వద్దకి వెళ్ళాడు విషయమేదో తేల్చుకుందామని.

"శంకరం! మనిషికి చదువొక్కటే ప్రధానంకాదు. తెలివి తేటలు, లోకజ్ఞానం, డబ్బు ముఖ్యం. కాలేజీలో చేర్పించలేదని నా మీద నీకిపుడు కోపంగానే వుండవచ్చు. కాని, నా ఆంతర్యాన్ని నీవిప్పుడు చూడలేవు" అన్నారు.

అంతే. శంకరం మాట్లాడలేదు. క్రమేణా లక్ష్మీపతిగారు శంకరం చేత వ్యాపార వ్యవహారాల్ని నడిపించారు. వాటిలో శంకరం ఆరితేరేలా చేశారు. కనుకనే ఆయన పోయినా వ్యాపారం ఆపేసినా, పల్లెటూళ్ళో వాళ్ళ భూముల విషయాలు చూస్తూ అక్కడే వుండి పోయాడు శంకరం.

* * *

# 3

రైల్వేస్టేషను కోలాహలంగా వుంది. ప్రయాణీకులతోనూ, ప్లాట్‌ఫారం వెండార్సు తోను నిండి తిరునాళ్ళలాగా వుంది. శంకరం రైలుదిగి ప్లాట్‌ఫారం మీద నడుస్తున్నాడు. అప్పుడే ఒక చిన్న సంఘటన జరిగింది. చాలా తమాషా సంఘటన ...

శంకరం అలా నడిచి వెళ్తున్నాడు ఇంతలో "మాష్టారూ!" అంటూ ఒక పిలుపు విన్పడింది. ఎవరినో లెమ్మను కున్నాడు శంకరం. అనుకున్నాడే కాని వెనుకకు తిరిగి చూడకుండా వుండలేక పోయాడు. ఒక యువకుడు. తెల్లని ప్యాంటు, షర్టు టకప్‌చేసి వున్నాడు. చేతిలో సిగరెట్టు సన్నని పొగను వదుల్తోంది.

"మిమ్మల్నే మేష్టారూ" అన్నాడతను.

శంకరం అతనికి దగ్గరగా వెళ్ళాడు.

"నమస్కారం మేష్టారూ !"

శంకరం ప్రతి నమస్కారం చేయక తప్పలేదు. ఆ వ్యక్తి ఎవరో శంకరానికి గుర్తురాలేదు.

"మర్చిపోయారా మేష్టారూ" అన్నాడా యువకుడు.

శంకరం తడబడ్డాడు. ఎవరీవ్యక్తి ? తనకు పరిచయస్తుడా ? ఎప్పుడు, ఎక్కడ ? తనేం జవాబు చెప్పాలి ? 'మీరెవరో నాకు గుర్తులేదు' అంటే ఏం బావుంటుంది అనుకున్నాడు. ఇంతలోనే ఆ యువకుడు "నేనండీ, సుబ్బారావుని. రామమోహన్ పరిచయం చేశాడు కదండీ నన్ను తమకు" అన్నాడు. అసలా రామమోహన్ అనే వ్యక్తి శంకరానికి తెలియదు. తన స్నేహితుల్లో ఆ పేరుగల వ్యక్తి ఒకతను వున్నాడు కాని అతనిప్పుడు ఢిల్లీలో ఎందులోనో పనిచేస్తున్నాడు. శంకరం "క్షమించండీ. గుర్తుపట్టలేదు" అన్నాడు రెండర్థాలు స్ఫురించేటట్లు.

ఇక ఆ యువకుడు ఏదేదో తగ్గు స్వరంలో చెప్పేస్తున్నాడు. ప్లాట్‌ఫారం సందడిలో శంక శంకరానికి అతను చెప్పేదేమీ వినిపించటంలేదు. కేవలం అతనివైపు చూస్తూ నిల్చుండిపోయాడు. కొద్దిసేపట్లోనే హైద్రాబాద్ ఫాస్టు పాసింజరు రావటంతో, ఆ యువకునితో 'వస్తానండీ మళ్ళీ కలుద్దాం' అని చెప్పి బ్రతుకు జీవుడా అని ముందుకు కదిలాడు. పదిఅడుగులు నడిచిన శంకరం చెవుల్లో "క్రాక్" అనే రెండు పొడి అక్షరాలు, గలగలమనే రెండు నిండు గొంతుల నవ్వు ప్రతిధ్వనించాయి శంకరం వెనుకకు తిరిగి చూశాడు. ఆ యువకునితో మరో యువకుడు నిల్చొని ఉన్నాడు ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు తనవైపు చూస్తూ. శంకరం చూడటంతో ఠక్కున నవ్వును ఆపేరు.

శంకరం ముందుకు కదలిపోయాడు క్రాక్ అన్నమాట గురించి ఆలోచిస్తూ.

ప్రయాణీకుల్ని తప్పించుకుంటూ నడుస్తున్న శంకరానికి ఎదురుగా నిలుచున్న ఇద్దరు నవ యువతులు కన్పించారు. ఇద్దరూ ఒకే డ్రెస్‌లో కన్పించారు. క్రిందికీ పైకీ స్కై-బ్లూ కలర్. ఆ కలర్‌కి తగిన గాగిల్సు.

ప్లాట్‌ఫారం చాల రద్దీగా వుంది. ఆ యువతులు కొంచెం ప్రక్కకు తప్పుకుంటారేమో ముందుకు వెళదామనుకున్న శంకరానికి ఆశాభంగంకలిగింది. కొంతసేపటికి ఒక యువతి గొల్లున నవ్వింది. గాగిల్సు తీస్తూ "గుర్తుపట్టలేదా బావా ?" అంది.

"రేణుకా ! నువ్వా ! అరే. ఎవరో అనుకున్నా" అని, కుశల ప్రశ్నలు వేశాడు శంకరం. వాటికి బదులు చెప్పి రేణుక తన స్నేహితురాల్ని పరిచయం చేసింది. "మాలతి, నా బహిఃప్రాణం" అంటూ.

"హల్లో రేణుకాదేవిగారూ ! హౌడు యూడూ !"

శంకరం అటువేపుకు చూశాడు.

వేణుమాధవ్. రేణుక అధికారి.

అతనితో శంకరానికి ఆట్టే పరిచయం లేదు. కాని ఫలానా అని తెలుసు.

పలకరింపుగా చిరునవ్వు నవ్వేడు శంకరం.

వేణుమాధవ్ కళ్ళు రేణుకమీదనే వున్నాయి. లేకపోతే, మాలతిమీదకూడా వున్నాయేమో !

"మీ రెక్కడ్నుంచి రావటం" రేణుక ప్రశ్నించింది.

"క్యాంపుకు వెళ్ళాను గదా ఇప్పుడే వస్తున్నాను" అన్నాడు చిరునవ్వుతో.

వేణు మాధవ్ వెనకాల నున్న ఇద్దరు వ్యక్తుల్ని చూసిన శంకరం గతుక్కుమన్నాడు. ఇందాకటి యువకులు. వాళ్ళు వేణు మాధవ్ స్నేహితులన్నమాట అనుకున్నాడు. అలా అనుకున్న శంకరానికి వేణు మాధవ్‌కూడా ఎంత అధికారి అయినా అలాంటి ఆకతాయి అలవాట్లవాడేమో ననిపించింది. అతనికి తెలియకుండానె వేణుమాధవ్ అంటే ఒక విధమైన — చెడు అని చెప్పుకోటం ఎందుకు — మంచిది కాని అభిప్రాయం ఏర్పడింది.

"కమాన్ మాలతీ. నువ్వూ అటే కదా రావటం టాక్సీలో పోదాం. రేణుకా దేవిగారూ వాళ్ళ బావగారు కారులో వెళ్తారు" అన్నాడు వేణుమాధవ్ కదులుతూ.

మాలతి ముఖంలో ఆనందం ప్రస్ఫుటించటం గమనించిన రేణుక సన్నగా నవ్వుకుంది. వాళ్ళు నలుగురూ అక్కడ్నుంచి కదులుతూ వుండగా "కొమ్మలిద్దరు మాంచి జోడు" అని యీలవేసుకుంటూ వెళ్తున్న ఆ కుర్రాళ్ళవైపు అసహ్యంగా చూశాడు శంకరం.

"మేనర్స్ లెస్ బ్రూట్స్" అన్న వేణుమాధవ్ మాటలకి ఆశ్చర్యపోయి అతనివైపు అదోలా చూశాడు శంకరం.

* * *

శంకరం రాక సౌభాగ్యమ్మకు, రేణుకకు, రఘుకు పరమానందాన్ని కలుగజేసింది. సౌభాగ్యమ్మకు ఆ రోజు పర్వదినంగా వుంది. పంచభక్ష్యపరమాన్నాలతో మేనల్లుడికి- కాబోయే అల్లుడికి- విందు చేసింది. శంకరంతో ముందుగా కొన్ని విషయాలు మాట్లాడాలనే షరతు పెట్టినా, రేణుక అతన్ని వివాహం చేసుకోటానికి అంగీకరిస్తుందని రఘుద్వారా తెలుసుకున్న తర్వాత ఆమె గుండెల మీదనుంచి సగంబరువు దించినట్లయింది.

ఆ రోజు భోజనాలైనాక హాల్లో విశ్రాంతి తీసుకుంటుండగా మొదలెట్టింది సౌభాగ్యమ్మ. "చూడునాయనా, శంకరం ! మీ మావయ్య పోయి నాలుగేళ్ళయినా పొలాలు షట్రా కనిపెట్టుకుని వుండి నువ్వు మాకు చేస్తున్న సహాయం ఇంతా అంతా కాదు. నిన్ను దగ్గరకు చేర్చినప్పుడే మీ మావయ్య నిన్ను ఈ ఇంటి అల్లుడుగా భావించారు. వారి కోరికను మేం మాత్రం ఎందుకు కాదనాలి ? అందుకనే నిన్ను ఇప్పుడు పిలిచింది. మీరూ మీరూ వొప్పుకుంటే ఆ మూడుముళ్ళూ వేయించేస్తాను. ఏమంటావ్ ?"

(సశేషం)



# వేటా, వాటా

అడవిలో ఒక సింహం వేటకు బయల్దేరింది. తనుకూడా వస్తానని ఒక అడవి గాడిద ముచ్చట పడింది. "మీ బలం నా వేగం కలిస్తే మనం ఎన్ని జంతువులనైనా ఇట్టే వేటాడి పట్టుకోగలం," అంది గాడిద. సరేనంది సింహం.

సాయంత్రం దాకా వేటాడి మొత్తంమీద రెండూ కలిసి చాలాజంతువుల్ని పట్టుకుని చంపాయి. వాటన్నిటిని సింహం ఒక చెట్టుకిందికి చేర్చింది. మూడు వాటాలుచేసి ఇలా అంది.

"నేను అడవికి రాజును కనక, ఈవాటా నాది. నీతోపాటు నేనూ వేటాడాను కనక, ఈ రెండోవాటా నాకు వస్తుంది. ఇక మూడోది : నువ్వుకనక తక్షణం కాలికి బుద్ధి చెప్పకపోతే, తరవాత ఏడుస్తూ కూర్చోటానికి కూడా ఉండవు నువ్వు !"

ఎవరి శక్తికి తగినట్లు వారు ప్రవర్తించాలి. తమకంటె బలవంతులతో స్నేహం చేస్తే ఇలాగే అవుతుంది.

# వజ్రాలు - మసిబొగ్గులు

డాక్టర్ మహీధర నళినీమోహన్

"కటిక చీకట్లో కూడా వజ్రాలు తళతళా మెరిసిపోతాయి!" అని చాలామంది అనుకుంటూ ఉంటారు. కాని అది నిజంకాదు. వజ్రాలు స్వయంగా ప్రకాశించవు. వాటిమీద పడినకాంతి ఒక ప్రత్యేకపద్ధతిలో ప్రతిఫలిస్తుంది. అందుకనే అవి స్వల్ప కాంతిలో కూడా ధగధగలాడతాయి.

నవరత్నాలల్లో వజ్రాలను మొదట పేర్కొన్నారు. చరిత్రకు అందని బహుకాలంనుంచి దేశదేశాలలో చక్రవర్తులు, సుల్తానులూ ఈ వజ్రాలకోసం చేసిన ఖర్చులు, వాటికోసం జరిగిన దొంగతనాలు, హత్యలు ...అదంతా ఒక విచిత్రమైన గాథ.

వజ్రం దొరికితే ప్రాణప్రదంగా దాచుకుంటారేగాని, వాటినికాల్చి పాడు చేసుకునే వెర్రివాడుండడు. కాని, 1797లో స్మిత్సన్ టెనంట్ అనే ఆంగ్ల శాస్త్రజ్ఞుడు నిజంగా అంతపనీ చేశాడు! అసలు వజ్రాలు ఏ పదార్థంతో తయారయాయో తెలుసుకోవాలనే జిజ్ఞాసతో ఆయన తన దగ్గరఉన్న వజ్రాన్ని కాల్చి, దానినుండి వచ్చే వాయువులను పట్టుకుని పరీక్షించాడు. ఇంతా చేస్తే అందులో నుంచి బొగ్గు పులుసు వాయువు (కార్బన్‌డైఆక్సైడు) మాత్రమే బయటికి వచ్చింది. మసి బొగ్గును కాల్చినా ఇదే వాయువు వస్తుంది. అంటే వజ్రమూ, మసిబొగ్గు ఒక్కటేనా? అక్షరాలా అంతే. రసాయన శాస్త్రజ్ఞుడిని అడిగితే ఆరెండూ ఒక్కటే నంటాడు. వజ్రంలో బొగ్గు తప్ప మరేదీ లేదంటాడు.

టెనంట్ చేసిన పరిశోధన చాలామందిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. అయితే, మసిబొగ్గులోనుంచి వజ్రాలు తయారుచేసుకోవచ్చునా? ప్రపంచం నలుమూలలా ఊహాగానాలూ పరిశోధనలూ మొదలు అయాయి. సీసం, పాదరసం ఉపయోగించి బంగారాన్ని తయారు చేసుకోవాలని అనేక వందల సంవత్సరాలపాటు లక్షలాదిమంది కృషిచేశారు. కాని, బంగారం తయారవలేదు. (వేమనయోగి బంగారం తయారుచేసేవాడు అనే ప్రతీతి నిజం కాదు.) అప్పట్లో సువర్ణయోగులకు తమ వైఫల్యకారణం తెలియదు. కాని, ప్రస్తుతం మనకు తెలుసు. సీసం, పాదరసం, బంగారం - ఇవి వేరు వేరు మూల పదార్థాలు. రసాయన ప్రక్రియల వల్ల వేరు వేరు మూల పదార్థాలను ఒకదా

వితో ఒకటి సంయోగించవచ్చునేగాని, ఆ మూల పదార్థాలనే మార్చివేయడం సాధ్యంకాదు. కాని, బొగ్గులోనుంచి వజ్రాలు తయారుచేయడం, సీసంలో నుంచి బంగారం తయారుచేయడంలాంటిది కాదు. ఇందులో మూలపదార్థాన్ని మార్చనక్కరలేదు. బొగ్గుయొక్క రూపాంతరమే వజ్రం. రసాయనికంగా రెండూ ఒకటే. భేదమల్లా బొగ్గు పరమాణువులు ఒకదానితో ఒకటి వెట్టావట్టాలు వేసుకునే పద్ధతిలోనే ఉంది. ఆ పద్ధతిని మార్చగలిగితే బొగ్గు వజ్రమై కూర్చుంటుంది.

అసలు వజ్రాలు ఎందుకు ? ఏంపనేమిటి ? అవి చాలా అందమైనవి కనుక. అవి దగ్గరఉంటే గొప్ప కనుక. శత్రురాజు యుద్ధంలో విజయం సాధించి అంతఃపుర ప్రవేశం చేయబోతూ ఉంటే వాటిని నూరుకుని తాగి, మహారాణీ వారు మానం కాపాడుకోడానికి. ఇంకా ఎన్నెన్నో ఉపయోగాలు. ప్రకృతిలో దొరికే వస్తువు లన్నింటిలోనూ వజ్రం అత్యంత కఠినమైనది. వజ్రాన్ని మళ్ళీ వజ్రమే కోయాలనిసామెతకూడా ఉంది. గనిలో దొరికే ప్రతి వజ్రమూ మహారాజావారి కిరీటాన్ని అలంకరించడానికి ఉపయోగించదు. చిన్న వజ్రాలను రకరకాల పరిశ్రమలలో ఉపయోగిస్తారు. విమానంలో ప్రొపెల్లరు ఇరుసు చుట్టూ, గడియారాలలో తిరిగే చక్రాల ఇరుసులచుట్టూ, కొండలను దొలిచే "డ్రిల్" మొనలుగా ...రకరకాలుగా వీటిని వాడతారు. చిన్నాచితకా వజ్రపు తునకలు కూడా ఉపయోగిస్తాయి. వాటిని పొడిచేసి కఠినమైన వస్తువులను అరగదీయడానికి వాడవచ్చు.

మొట్టమొదట వజ్రాలు కొన్నికొన్ని నదుల శయ్యలలో గులకరాళ్ళ మధ్య దొరికేవి. అసలు వజ్రాలు దొరికే నదీ శయ్యలే అరుదు. లక్షల కొద్దీ గులకరాళ్ళను పట్టుకుని పరిశీలిస్తే ఒక్కొక్క వజ్రం దొరుకుతుందేమో.

ఎండకు ఎండి, వానకు తడిసిన రాళ్ళు చితికి, నదీ ప్రవాహంలో అరిగి, గులకరాళ్ళు మిగులుతాయి. వజ్రాలు గులకరాళ్ళలో దొరికాయంటే అవి మొట్టమొదట నది ప్రవహించే దారిలో ఏవో ప్రత్యేకమైన రాళ్ళమధ్య ఉండి ఉంటాలి. ఆ రాళ్ళు ఉండేచోటు కనుక దొరికితే నదీ ప్రవాహం ఆ వజ్రాలను తొలగించుకు పోకముందే, ఆ రాళ్ళను పగులగొట్టి, లోపల చిక్కుబడి ఉన్న వజ్రాలను మనమే సంగ్రహించవచ్చు. ఈ ఆశతో వజ్రాలు ఉండే రాళ్ళకోసం వేట ప్రారంభమైంది. ఆఖరికి అటువంటి రాళ్ళు దొరకనూ దొరికాయి. ఒకరకపు లేత నీలిరంగు రాళ్ళుఅవి. అనేక కోట్ల సంవత్సరాల క్రితం భూగర్భంలో శిలాద్రవంగడ్డకట్టగా, వాటి మధ్యపడిన మసి, బొగ్గులు వజ్రస్ఫటికాలుగా ఏర్పడ్డాయి. కొన్నిచోట్ల ఆ శిలా ద్రవం భూగర్భం లోని ఒత్తిడికి బయటికి వచ్చి, చల్లబడి.

స్తంభాలుగా ఏర్పడింది. వానకి, గాలికి పైపొరలు చివికి నీలపు శిలాస్తంభాలు బయటపడ్డాయి. అటువంటి స్తంభాలు దక్షిణాఫ్రికాలో విశేషంగా ఉన్నాయి.

ప్రపంచంలో ఏటా రెండున్నర టన్నుల వజ్రాలను గనులలోనుంచి తవ్వి బయటికి తీస్తున్నారు పీటిలో ఐదవ వంతు మాత్రమే రత్నాలు అన దగ్గ మేలు రకపు వజ్రాలు. మిగిలిన వన్నీ పరిశ్రమలలో వినియోగమవు తున్నాయి. ఒక్క రతి వజ్రం దొరక డానికి 64 కోట్ల రతుల నీలి రాతిని తవ్వి తీసి. పగులగొట్టి, కడిగి, పరిశీ లించాలి, అందుకనే వజ్రాలు అంతంత ఖరీదు.

అసలు రాళ్ళల్లో వజ్రాలు ఏ పరి స్థితులలో ఏర్పడతాయో తెలిస్తే, అటు వంటి పరిస్థితులు మనమే కల్పించి, కృతకంగా వజ్రాలు తయారుచేసుకో వచ్చును గదా ? భూమిలో నీ తుగా విపరీతమైన ఉష్ణోగ్రతలో బొగ్గువేడెక్కి అసాధారణమైన ఒత్తిడికి నొక్కుకుని వజ్రం తయారవుతోంది. కనుక వజ్రా లను కృతకంగా తయారుచేయాలంటే భూగర్భంలో ఉండే ఉష్ణోగ్రతను, అంతకన్న ముఖ్యంగా ఒత్తిడినీకల్పించా లన్నమాట. ఈ సంగతి తెలిశాక అనే కులు ప్రయోగశాలలో వజ్రాలుతయారు చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేశారు.

1880లో ఇంగ్లండులో "హానే" అనే ఆసామీ వజ్రాల తయారుకి పూను కున్నాడు. కిరోసిన్, గాసొలిన్, పేర ఫిన్ వంటి వస్తువులు (వీటిలో బొగ్గు ఉంది) తీసుకుని, వీటికి లిథియమ్. ఎముకలు బట్టీ పట్టగా వచ్చిన నూనె కలిపి, మందంగా దిట్టంగాఉన్న ఇనుప గొట్టాలలో పోసి, అన్నివైపులా మూసి, వాటిని నిప్పులలో వేసి చాలాసేపు కాల్చేడు. ప్రయత్నించిన 80గొట్టాలలో 77 గొట్టాలు బాంబులలా పేలి పోయాయి. మిగిలిన మూడుగొట్టాల లోనూ లోపలి వస్తువులు వేడికి, ఒత్తిడికి గట్టిగా నొక్కివేయబడ్డాయి. తరువాత ఆ గొట్టాలను పగులగొట్టి చూస్తే అందులో వజ్రాలు తయారై ఉన్నాయట ! అవి ఇప్పటికి లండన్ లోని బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నాయి.

1894లో "హెన్రీ మొయిజాన్" అనే ఫ్రెంచి రసాయన శాస్త్రజ్ఞుడు మరో పద్ధతి కనిపెట్టేడు. ఇనుము, మసిబొగ్గులు కలిపి, గాలిలేని చోట ఎలక్ట్రిక్ ఫర్నేస్‌లో వేసి కాల్చాడు. కరిగిన ఇనుములో బొగ్గు కలిసిపో యింది. ఆ మిశ్రమాన్ని చటుక్కున నీళ్ళల్లో ముంచాడు. ఇనుము బిగుసు కుని బ్రహ్మాండమైన ఒత్తిడితో లోపల ఉన్న బొగ్గు పలుకులను నొక్కివేసింది. తరువాత వాటిని ఆమ్లములలో వేశాడు. ఇనుము కరిగిపోయి గట్టి స్ఫటికాలు మిగిలేయి. అవే వజ్రాలు !

1928లో ఛార్లెస్ పార్సన్స్ అనే శాస్త్రజ్ఞుడు హానే, మొయిజాన్‌లు చేసి నట్లే వజ్రాలు చేయబూనుకున్నాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా హానే చెప్పి న పద్ధతిలో వజ్రాలు తయారుకానేలేదు.

మొయిజాన్ చెప్పిన పద్ధతిలో చేయగా గట్టి స్ఫటికాలు వచ్చాయి కాని. అవి వజ్రాలు కావని తేలింది.

మామూలు బొగ్గు పరమాణువులు ఆరేసి కలిసి షడ్భుజిలా ఏర్పడితే దానిని "గ్రాఫైట్" అంటారు. అవి ఇటుకలు పేర్చినట్లు ఒకదానిమీద ఒకటి అమరి ఉంటాయి. కార్బన్ పరమాణువులు "పిరమిడ్" ఆకారంలో అమరితే అది వజ్రం అవుతుంది. ఈ రెండింటికీ అదే భేదం

గ్రాఫైటులో బొగ్గు పరమాణువులు స్థిర విద్యుచ్ఛక్తులవల్ల(ఎలక్ట్రో స్టాటిక్ ఫోర్సెస్) షడ్భుజాకారంలో సుస్థిరంగా ఉంటున్నాయి. వాటిని 3000 డిగ్రీలు సెంటిగ్రేడుకి వేడిచేస్తే బొగ్గు పరమాణువులు తీవ్రంగా కంపించి, వాటిని బంధించి ఉంచే విద్యుచ్ఛక్తులను అధిగమించి, స్వతంత్రము అవుతాయి. అప్పుడు మామూలు వాతావరణపు ఒత్తిడికి 30 000 రెట్ల వత్తిడితో నొక్కితే బొగ్గు పరమాణువులు పిరమిడ్ ఆకారంలో సర్దుకుని వజ్రము అవుతాయి. భూగర్భంలో ఇదే జరుగుతోంది.



వజ్రం

(పిరమిడ్)



గ్రాఫైటు

(షడ్భుజి)

హానే మొయిజాన్ లుచేసిన పద్ధతులలో వాతావరణపు వత్తిడికి రెండు వేల రెట్లనుమించి ఒత్తిడి ఏర్పడదు కనుక వారు చెప్పిన పద్ధతుల ప్రకారంవజ్రాలు తయారై ఉండడానికి వీలు లేదు. వారిద్దరూ పొరబడి ఉండాలి.

1955 లో మళ్ళీ వజ్రాల తయారీకి అమెరికాలో ప్రయత్నాలు జరిగేయి. భూమిలో 240 మైళ్ళ లోతున ఉండే పరిస్థితులు . అంటే 3000 డిగ్రీలు సెంటిగ్రేడు ఉష్ణోగ్రత, 53,000 వాతావరణముల ఒత్తిడి కృతకంగా కల్పించి అంగుళంలో 16 వ వంతు సైజులో ఉన్న చిన్నారి వజ్రాలను మొట్టమొదటి సారిగా తయారుచేశారు ఆ ప్రయత్నంలోనే వజ్రం కన్న కఠినమైన "బోరజోన్" అనే మరో పదార్ధాన్నితయారు చేయగలిగేరు. "బోరాన్" కలిసిన వస్తువు అది. అది వజ్రాన్ని కూడా కోయగలదు !

★★★

---









"ఛాయ"

ఆదేవిటా తెల్లారి నిద్ర లేచేటప్పటికి పడకగదిలో ఉన్న ప్రతీ వస్తువూ తనను తీక్షణంగా చూడడం గమనించి, కలవర పడింది ఇందిర. ఎప్పుడూ ప్రేమతో చూసే అమ్మ కూడా ఆ గిల్టుఫ్రేములోంచి చిరాగ్గా చూస్తోంది "యేవిఁటే, ఇప్పుడా లేవడం ?" అన్నట్టు. పుస్తకాల షెల్ఫు, టేబిల్ లైటు 'జాగ్రత్త' అని హెచ్చరిస్తున్నాయి. 'ఇవాళ తనకేమయింది ?' అని గదంతా కలయ చూసింది. అప్పుడే బల్లక్రింద నుంచి తొంగి చూస్తున్న యెలుక పిల్ల ఒక్క విషపు చూపుచూసి త్వరత్వరగా వెళ్ళిపోయింది. సాధారణంగా యెలుక పిల్లలు చూపుల్లో ప్రేమాభిమానాలు కనబడతాయి. అలాంటిది ఇంత చిన్న యెలుకమ్మ, తన వెందుకలా చూసింది చెప్మా, అని మంచంమీదే కూర్చుని ఆలోచిస్తోంది ఇందిర.

ఇంతలో తలుపుతెరుచుకుని, ఇందిర తల్లి వచ్చింది గదిలోపలికి. మంచం మీద తీరిగ్గా కూర్చున ముద్దుల కూతుర్ని చూసి "అదేవిఁటే అమ్మాయ్, తెల్లగా తెల్లవారింది కదా, మళ్ళీ కాలేజీకి ఉరుకులూ పరుగులూనూ. లేవకూడదమ్మా. ఏవిఁటా ఆలోచన కొంపలు మునిగినట్టు ?" అంది మెల్లిగా మందలిస్తూ. అమ్మ కళ్ళల్లో ఆప్యాయం. తను మనసారా చూసి, అమ్మకీ, అమ్మఫోటోకి యెంత తేడా ఉంది అని ఆశ్చర్యపోతూ మంచంమీదనుంచి దిగింది ఇందిర.

గబగబా తయారయి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని కాలేజీకి బయలుదేరింది ఇందిర. చదువుకునే రోజుల్లోనే నయం. చిరాగ్గా ఉంటే క్లాసులు యెగ్గొట్టేది. ఇప్పుడలా వీల్లేదు. ఇష్టం ఉన్నా లేకపోయినా వెళ్ళి తీరాల్సిందే. 'వెధవ ఉద్యోగం' అనుకుంది చిరాగ్గా. పోనీ ఉద్యోగం మానేద్దామా అనుకుంటే, మానేసేం చెయ్యాలి అని ఇంకో సవాలు. సుఖంగా ఇంట్లో పడుండనివ్వదు యిది. అసలిప్పటికే 'పెళ్ళో పెళ్ళో' అని ఒకటే పోరుతోంది అమ్మ. నాన్నగారు మొన్ననయితే నవ్వుతూ అననే అన్నారుకూడా "ఎవరో" ఒక శాల్తీని. నువ్వన్నా చూసుకో. నన్నన్నా చూడనీ అని. అదేవిఁటో పెళ్ళికాని, పెళ్ళి చేసుకోదల్చుకోని ఆడపిల్ల అంత వింతగా, అసహజంగా కనిపిస్తుంది. అయినా తనేంచేసుకోగూడదని ఏం వ్రతంపట్టలే



డుగా. ఎటొచ్చీ తనకు అన్నివిధాలా నచ్చిన మనిషి కనబడలేదింతవరకూ. అసలు సుమిత్ర తన వర్ణన విని. 'అటువంటి మనుషులు చాలా అరుదు ఒకవేళ అలాంటివాడొకడున్నా అతనికి నువ్వు నచ్చకపోవచ్చు కాబట్టి నువ్వు నీ నిర్ణయం మార్చుకోకపోతే 99 శాతం బ్రహ్మచారిణివిగా ఉండిపోతావు జాగ్రత్త' అని బెదిరించింది

పెళ్ళిని గురించి ఆలోచన వచ్చినప్పుడల్లా. ఈమధ్య మనసులో శ్రీనివాసుడే మెదులుతున్నాడు. అతన్ని మొదట కమల ఇంట్లో కలిసింది ఆకర్షణీయంగా ఉన్న అతని మాటకారితనం ఆమెను ముచ్చట పరిచింది రెండోసారి అతన్ని చూసింది ప్రమీల ఇంటిలో ప్రమీలకు దూరపు చుట్టమూ వరసకు బావ అవుతాడట ప్రమీల చక్కనిదీ ఆ పైన

తియ్యగా పాడుతుంది కూడా. వాళ్ళిద్దరి వరసా చూసి, అతనిపైన ఆశలు పెట్టుకోకూడదని గుండె రాయిచేసుకున్నతర్వాత ప్రమీల చెప్పిందొక శుభవార్త. "భలేదానివే ఇందూ, మా బావను ఒక్క ఊపు ఊపావు. నీ గురించి అడిగి యమ బోరెత్తిస్తున్నాడు నన్ను" అంది తమాషాగా నవ్వుతూ. 'నిజం అయితే బాగుండు' ననుకున్న ఇందిర గుండెలు టకటకమని పెద్ద చప్పుడు చేస్తూ గబగబా కొట్టుకున్నాయి. ఆ తర్వాత అతన్ని అండజనుసార్లన్నా చూసింది. ప్రతిసారీ, అతనికి తనంటే ప్రత్యేకాభిమానం ఏం లేదేమోననీ, ప్రమీల మాటలు కేవలం నవ్వులాట కన్నవేమోననీ ఇందిర సందేహిస్తూనే ఉంది. కానీ, అతన్ని చూసిన ప్రతిసారీ అతనంటే ఆకర్షణ, ఒంటరి జీవితమంటే జుగుప్స అధికమవుతున్నాయి. అతన్ని ఎలాగయినా సరే తన వైపుకి తిప్పుకోవాలని నెలరోజులుగా ప్రయత్నిస్తోందామె. కానీ, అత నంటీ ముట్టనట్టున్నాడు. 'మరీ తామరాకుమీది నీటిబొట్టులా ఏమిటీ ప్రవర్తన' అని ఎంతో విసుక్కుంది ఇందిర. తనంటే ఎంతో ఇష్టం ఉన్నట్టు కనబడతాడు - మళ్ళీ అది కేవలం స్నేహభావం తప్ప ఇంకేంకాదేమో నన్నట్టు ప్రవర్తిస్తాడు. అమీతుమీ తేల్చుకోవా లనిపించినా, ఎలా తేల్చుకోవాలో తెలియక ఊరుకుంది.

సరే, ఎలాగో అవస్థపడి బస్సులో పది నిమిషాల ప్రయాణం తర్వాత కాలేజీ చేరింది ఇందిర. క్లాసులో పాఠం చెబుతుంటే వెనక బెంచీలో కూర్చుని కిసుక్కున నవ్విన రేవతిని గట్టిగా కోప్పడి క్లాసులోంచి బైటికివెళ్ళిపొమ్మంది. ఆ పిల్ల, అందుకోసమే యెదురు చూస్తున్నట్టు చిరునవ్వుతో క్లాసులోంచి వెళ్ళడం చూశాక నీరసమనిపించిందామెకు. గబగబా నాలుగు ముక్కలు చెప్పి పది నిమిషాలు ముందుగా క్లాసు వదిలిపెట్టింది. "అసలీ రోజు మంచిది కాదు" అని తనకు తాను నచ్చజెప్పుకుని కాలేజీ నుంచి బైటపడింది. బస్సుకోసం చూస్తున్న ఇందిరను హడావిడిగా పలకరించింది కమల. కమల హిస్టరీ చెబుతుంది అదే కాలేజీలో. ఇంకో కమ్మాయితో కలిసి ఆమె కాలేజీకి దగ్గర్లో ఒక యింట్లో ఉంటోంది. తమ గదికి వచ్చి ఆ పూట గడపమని ఆహ్వానించగానే, సరేనని బయల్దేరింది ఇందిర, ఇంటికివెళ్ళి తన గదిలో తనవంక కోపంగా చూసేబల్లనీ, పుస్తకాల షెల్ఫునీ యెదుర్కొనే ధైర్యం లేక.

కమల స్నేహితురాలు మంజుల ఏదో న్యూస్ పేపరు ఆఫీసులో పని చేస్తోంది. ఆ పిల్ల అతి ఆధునికంగా ఉంటుంది. అంటే కేవలం అలంకరణలోనే కాదు, అలవాట్లలో కూడా. సిగరెట్లు కాల్చే ఆ సుందరి తెలివితేటలు అసాధారణమైనవి. రాజకీయాలూ, సాహిత్యమూ ఆ పిల్ల అభిమాన విషయాలు. మొత్తంమీద ఆమెతో గడిపే గంటలు ఎంత లేదన్నా అరగంటల్లా గడిచిపోతాయి.

ఆ అమ్మాయి స్నేహబృందం కూడా అటువంటిదే. అతి వాస్తవిక సాహిత్యమూ, ఆంధ్రప్రదేశ్ రాజకీయాలూ కూలంకషంగా చర్చించారు కమలా, మంజులా ఇందిరతో. గడియారం అనుకున్నదానికంటే తొందరగా తిరగడంతో, ఇల్లు చేరే వేళయిందని గమనించి నీరసంగా లేచింది ఇందిర. మంజుల ఒప్పుకోలేదు. "ఆరవ్వగానే ఇల్లు చేరుకోవాలని యేమన్నా రూలుందా? చిన్నపిల్లవి కావుగా చీకటిని చూసి ఝడుసుకోవటానికి. ఇంకాసేపుండి వెడుదువుగానీ కూర్చుందూ" అని గదమాయించింది. కమల వంత పాడుతూ అందుకుంది. "కాదు మంజూ, ఈ అందగత్తెని ఏ రాకుమారుడు ఎత్తుకుపోతాడేనని వాళ్ళమ్మగారి భయం." "మరే. నా అందానికి ఒక్క రాకుమారుడే తక్కువ" అంది ఇందిర ముఖం చిట్లించి కూర్చుంటూ. "ఎంత ప్రేమ ఉన్నా, నన్ను కని పెంచిన మా అమ్మ కూడా నే నందగత్తెనని అనలేదు."

"హలో, మర్యాదగా తలుపు కొడితే వినిపించుకోలేదు. మరేం చెయ్యమంటారు?" అన్నాడు శ్రీనివాసరావు ఎదురుగా నుంచుని.

"ఇన్నాళ్ళకా కనబడడం పెద్దమనిషీ?" అంది మంజుల. "రా కూర్చో" అని కుర్చీ చూపించి ఇందిరని పరిచయం చేయబోయింది. "వీరు నాకిదివరకే తెలుసు మంజులా. మా ప్రమీల స్నేహితురాలు" అన్నాడతను అందంగా నవ్వుతూ. అతని నవ్వు అరగాలను పెట్రోలియ్యి మండుతున్న ఇందిర గుండెల్ని భగ్గుమనిపించింది. "ఏవిటితని అభిప్రాయం? తన స్నేహితురాలనని చెప్పుకోడానికి నామోషీయా? ప్రమీల స్నేహితురాలినిట. ఛీ" కమలతోనూ, మరీ ముఖ్యంగా మంజులతోనూ అతను మాట్లాడే ధోరణి చూసి, ఇంకా మండిపడింది ఇందిర లోపల్లోపల. ఎంతో కులాసాగా, చమత్కరిస్తూ మాట్లాడుతున్న ఆ తీరున తనతో యెన్నడూ మాట్లాడలేదతననుకుంది. అతనికి తను స్నేహితురాలు కాదు. తన వంకకూడా అతి తక్కువగా చూస్తూ, ఎప్పుడో తప్ప తనతో సూటిగా మాట్లాడని అతని ప్రవర్తన ఇందిరకు దుర్భరమనిపించింది. అయినా తనని తను సముదాయించుకోడానికి 'అత నెలా ఉంటే తనకేం - తనూ పట్టనట్టూరుకుంటేసరి అనుకుంది. అంతేకాక, వెంటనే లేచి వెళ్ళిపోరాదూ అని కూడా ఆలోచించింది. ఇంతలో మంజుల "నువ్వూ ట్రై చేస్తావా?" అనడగడంతో ఏవిటా అని తలెత్తి చూసింది. మంజుల చాపిన చేతిలో, ఆమె పొడవైన వేళ్ళ మధ్య తెరిచిఉన్న తెల్లని సిగరెట్టు పెట్టె కన్పించింది. "తీసుకో ఒకటి. అభ్యంతరం లేకపోతే" అంది మంజుల. క్షణంసేపు సందేహించిన ఇందిర, తనూ మంజులలాంటిదేనని అతనికి తెలియపరచాలన్నట్లు ఒక సిగరెట్టు తీసుకుంది. అతను జేబులోంచి లైటరు తీసి మంజుల సిగరెట్టు వెలి

గించి ఇందిర వంక తిగాను నో థాంక్స్ అంటూ కమల అందించిన అగ్గిపుల్లతో సిగరెట్టు వెలిగించింది ఇందిర. ముగ్గు రాడవాళ్ళూ, అతడూ సిగరెట్లు కాలుస్తున్న దృశ్యం తమాషాగా ఉంది. ఎవరి ఆలోచనల్లో వాళ్లున్నారు. ఇందిర మాత్రం పొగ మింగెయ్యకుండా, సిగరెట్టు కాల్చడంమీద తన దృష్టిని లగ్నం చేసింది. పొగగానీ మింగితే ఎంత బాధో తెలుసును ఇందిరకు. తలంతా తిమ్మిరెక్కినట్టయి పోతుంది కొద్ది నిమిషాలసేపు. ఆపైన పలకమారి దగ్గు వచ్చినారావచ్చు సగం సిగరెట్టు కాలాక కొంత తేలికపడింది ఇందిర శ్రీనివాసరావు అంతవరకూ నిశితంగా ఆమె వంకే చూస్తున్నవాడల్లా చటుక్కున తల తిప్పి మంజులతో మాట్లాడడం మొదలెట్టాడు. మొదట్లో ఎందుకో సిగ్గుపడ్డా తనను తను మందలించుకుని వాళ్ళ మాటల్లో ఆసక్తి కనబరచడానికి ప్రయత్నించింది. ఆమెవంక చూడకుండా, ఆమెకు తెలియని విషయాల గురించి మాట్లాడుతున్నాడతను. ఎదుటి గోడమీది బల్లి నల్లపూసల్లాంటి గుడ్లతో చూస్తూ మందహాసం చేస్తోంది ఎలుకపిల్లని



విషపు మాటలన్నా భరించవచ్చు కానీ. పిల్లల మందస్మిత వదనాలు చూడ శక్యం కావనే సత్యాన్ని ఆరోజు గుర్తించింది ఇందిర. కమలా, మంజులా అతని మాటలను తాగేస్తున్నారు. ఇదంతా అవమానకరంగా తోచింది ఇందిరకు. తనెలావుంటే అతనికేం? నిజమే, తనే సిగ్గులేకుండా అతని అనుమతి కోసం చూస్తున్నట్టు ప్రవర్తిస్తున్నది. 'అతనికీ తనకీ ఏ విధమైన సంబంధం ప్రస్తుతం లేదు. ఇకముందు బహుశా ఉండబోదు' అని గట్టిగా అనుకున్నాక ఇందిర మనసెంత తేలికపడిందంటే, పదిహేనువేల మైళ్ళు కాలినడకను ప్రయాణం చేసినంత అలసట, నీరసం వచ్చాయి. బలవంతాన లేస్తూ ఇంక వెళ్ళిపోవాలి. నాకు తెలుసు ఈ రోజు ఇలాంటిదని అనుకుంది. తను లేవడం కూడా ఎవరూ గమనించినట్టు లేదు.

"ఇంక నే పోతాను మంజులా - చాలా థాంక్సు" అంది గట్టిగా. "సరే మళ్ళా ఎప్పుడన్నా రావాలి" అంది మంజుల వెళ్ళిరమ్మన్నట్టు చూస్తూ. "చీకటి పడింది జాగ్రత్త ఇందిరా! బూచా డెక్కడన్నా ఉన్నాడేమో" వెక్కిరించింది కమల. "ప్రపంచంలో ఉన్న వాళ్ళంతా బూచాళ్ళే- భయపడి లాభం లేదు" అంది ఇందిర వేదాంతిలా. "మీ రెక్కడికెళ్ళాలి?" అనడిగాడు శ్రీనివాసరావు. జవాబు చెప్పకుండా కాంతి లేని కళ్ళతో అతని వంక చూసి నవ్వులాటి దొకటి నవ్వింది.

"చిక్కడపల్లి" అందించింది కమల. "నాకూ అటువేపు పని ఉంది. పదండి నేనూ వస్తాను" అని మంజుల వంక తిరిగి "ఇంకోసారి మళ్ళీ వస్తా మంజులా. ఈసారి కిప్పుడు వదిలెయ్యి" అంటూ మంజుల చెప్పేది వినిపించుకోకుండా ఇందిర వెనకాలే నడిచాడు.

ఇందిర గ్లాసెడు హార్లిక్సు తాగినట్టు ఫీలయింది. మౌనంగా ఇద్దరూ బస్సు స్టాండు దగ్గర నుంచున్నారు. బస్సు కోసం నుంచున్నవాళ్ళట్టేమంది లేరు. "ఇవాళ చాలా మంచిరోజనిపిస్తోంది నా" కన్నా డతను, నిశ్శబ్దాన్ని చెదరగొడుతూ. "మంచి రోజా? ఏమో. నేను మాత్రం ఈ రోజంత చెడ్డ రోజు ఇంకెప్పుడూ చూడలేదు" అంది తల అడ్డంగా ఊపుతూ.

"అదేం అలా అంటున్నారు?" వింతగా అడిగా డతను. "అదేమిటో ప్రొద్దున్న లేవగానే, నా గదిలో కుర్చీలూ, బల్లా కూడా కోపంగా చూశాయి. అప్పుడే అనుకున్నాను ఈ రోజు మంచిదికాదని."

"ఇప్పుడది నిజమని రుజువయింది కాబోలు" నన్నాడు. 'అబ్బే. అలా గనకంతే'దని తడబడిందిఆమె. "ఇటు చూడండి, ఇందిరా. మీకు వీలుంటే వకసారి రేపు ప్రమీల ఇంటికి రాగలరా?" ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్టుంది అతని కంఠం.

"నేనా, యెందుకూ?"

"మీతో యెన్నో విషయాలు చెప్పాలి నేను. నిజంగా సీరియస్‌గా అంటున్నా" నన్నాడతను. "అన్ని విష

యాలలో మమ్మల్ని పక్కాటి చెప్పండి. నేను వచ్చేదీ రాందీ చెబుతాను" అంది ఇందిర ధైర్యం తెచ్చుకుని.

క్షణం ఆలోచించి అన్నాడతను "పెళ్ళి అనే వ్యవస్థ గురించి మీతో వివరంగా చర్చించాలి." మనస్సులోని భారాన్ని యేదో అదృశ్యహస్తం పూర్తిగా తుడిచివేసింది. ఆ నిమిషంలో ఆమెకి ప్రపంచ మతిసుందరంగా కనిపించింది. తృప్తిగా 'నా కింకేం కావాలి' అనుకుందికూడా. తాను ఇంతకాలం తపస్సుచేసిన మనిషి ఛాయలెక్కడా కనిపించలేదు ఆమె మనస్సులో. ఆ జాగాలో శ్రీనివాసరావే కనబడ్డాడు.

"తప్పకుండా వస్తా" నంది ఇందిర మెల్లిగా. ఎదురు చూడని బస్సు వచ్చింది. "ఇందిరా" అన్నాడతను "వస్తావుకదూ" అన్నట్టు ధ్వనిస్తూ. చిరునవ్వుతో వెయ్యూపింది ఇందిర.

"తమని వదిలిపెట్టివెళ్ళేరోజు దగ్గర కొచ్చిందనేమో తన గదిలో వస్తువులు తన వంక బాధగా, జాలిగా చూశాయి. తాను మాత్రం సినిమాలో నాగేశ్వర్రావులా అపార్థం చేసుకుంది వాటి వ్యధాపూరిత దృక్కుల"నుకుంది ఇందిర బస్సులో కుదుపులకి క్రిందికి వొరగకుండా కమ్మీని గట్టిగా పట్టుకుంటూ.

★★★




ఇంకా సర్కసుకి
టైమవలేదు...!



# నవ్వాలి నవ్వాలి ...

★ "ఇంత లేటుగా ఇంటికి వెడితే మీ ఆవిడ ఏమీ అనదా ?"

"నాకు పెళ్ళే కాలేదోయ్"

"అయితే ఇంత పొద్దు పోయేదాకా ఇంటి కెళ్ళకుండా తిరుగుతావేం ?"

★ ఇద్దరు తాగుబోతులు రైలు పట్టాల మధ్యగా నడుస్తున్నారు.

ఒకడు :_ నా జన్మలో నే నెప్పుడు ఇన్ని మెట్లెక్కలేదు.

ఇంకోడు :_ అది సరే. మెట్లెక్కేటప్పుడు పట్టుకోటానికి వీల్లేకుండా కడ్డీలు కూడా ఎంత కిందుగా పెట్టారో చూడు.

★ అర్ధరాత్రివేళ ఒకడు పూటుగా తాగి లాంతరు స్తంభం దగ్గర నిలబడి "తలుపు తీయ్. విన్నే ! తలుపు తీయ్" అంటున్నాడు.

ఆ దారిన పోతున్న ఇంకో తాగుబోతు "లాభం లేదోయ్, ఇంట్లో ఎవరూ లేనట్టున్నారు" అన్నాడు.

"లేకపోవడ మేమిటి? పైన లైటు వెలుగుతుంటేః" అన్నాడు మొదటి వాడు.

★ ఇంకో ఇద్దరు తాగుబోతులు పోయిన మనీపర్సు కోసం వెదుకుతున్నారు.

"ఊహుం ఈ గదిలో పర్సు పోతే దిసుకుంటాను"

"అయితే పక్క గదిలో వెదుకుదాం"

"పక్కన గది లేందే ?"

"అయితే, గది కట్టించి మరీ వెదుకుదాం."

★ "మీ రెండో నవలలో కథ చాలా తమాషాగా వుంది. ఎక్కడన్నా కొట్టేసిన బాపతా ?"

"నా మొదటి నవల కథతో తీసిన సినిమా చూసి రెండో నవల రాశాను."

★ ఒక పత్రికలో "ప్రశ్నలు, సమాధానాలు" శీర్షికకు ఒకడు ఉత్తరం రాస్తూ :

"నా వయస్సు 19 ఏళ్ళు. మొన్న రాత్రి పొద్దుపోయి రెండింటికి యింటికి వచ్చాను. మా నాన్నగారు చివాట్లు పెట్టారు. నేను చేసిన తప్పేమిటో తెలియటంలేదు"

సంపాదకుని సమాధానం :_ "జ్ఞాపకం తెచ్చుకోండి."

(గత సంచిక తరువాయి)




యద్దనపూడి సులోచనారాణి

ఆ రాత్రి సంధ్య బాబుని తాకాలన్నా, వాడివైపు చూడాలన్నా భయపడింది. ఎంత వద్దనుకున్నా మళ్ళీ దృష్టిపెళ్ళి వాడిమీదనే నిలుస్తోంది. మాటి మాటికి యిది నిజమా ? నిజమా అన్పించసాగింది. వాడి ముఖంమీద కళ్ళు నిలవగానే ఏదో వింతగా, ఆనక్తిగా భయం భయంగా వుండే అనుభూతి కలుగుతోంది. అసలు యీ సృష్టిలో మనిషిపుట్టుకే మహాచిత్రం. అందులో బాబు జన్మవృత్తాంతం మరీ విచిత్రంగా వుంది. బాబు తనవాడని తెలిసిన తర్వాత మాధవ్ ఎందుకో వేరుగా అన్పించటం లేదు. అతను మళ్ళీ తన జీవితంలో రాకపోతే బాబుని యిలా కళ్ళారా చూసుకునే భాగ్యం తనకి కలిగేదా ? అసలిన్నాళ్ళు బాబు ఎవరో తనకెందుకు తెలియ జేయలేదు ? లేక అతను తెలియజేసే అవకాశమే తనివ్వలేదా ? అప్పుడప్పుడు అతను బాబునెత్తుకుని గుండెలకి హత్తుకుంటే ఆ దృశ్యం చూడగానే తనలో యీర్ష్య భగ్గుమని ఆకాశం ఎత్తున ఎలా లేచేది ? బాబు తల్లిని అతను అధికంగా ప్రేమించేవాడని, ఆ అనురాగానికి చిహ్నం కాబట్టే వాడంత అపురూపం అని ఏవేవో అనుకునేది. ఆ ఆలోచనలే ఒకవేళ నిజం అయితే ఆ వ్యక్తి ఎవరు ?

ఇది గుర్తుకు రాగానే సంధ్య ఎలాగో అయిపోతుంది. మనసులో అంత అభిమానం వుంచుకున్న మాట ఒక్క నాడుకూడా, ఒక్క సారి కూడా బైట పడలేదేం ! అప్పుడప్పుడు అతను చూపిన చనువు చూసి అది అధికారం అని భయపడి అసహ్యించుకుంది. ఆ అసహ్యం బైటపెట్టడంలో ఏమాత్రం జంకు చూపించలేదు అసలతనికి అంత ఓర్పు ఎలా వచ్చింది ? ఎందుకు వచ్చింది ? ఇంత బాధని మూగగా అనుభవించాల్సిన అవసరం ఏముంది ? నిజాన్ని నిర్మొహమాటంగా చెప్పేసి ఔను కాదు అని తేల్చేసుకోవచ్చుగా ! లేక బాబునికూడా ద్వేషిస్తానేమోనని భయపడ్డాడా? బాబు ఎవరో తెలియకముందు కొద్దిగా ద్వేషించిన మాటకూడా నిజమే! అది పూర్తిగా బాబుమీద కూడా కాదు. వాడంటే అతనికి అంత అపురూపం, వాడి కేదయినా బాధ కలిగితే అతని మనసు ఎలా విలవిల లాడుతుందీ చూడాలనిపించి బాబుకి ఏదయినా ఆపద రావాలని తను కోరుకున్న మాట కూడా నిజమే ఒకటి రెండుసార్లు తనే బాబుకి అపకారంచేసి

దాని ద్వారా మాధవ్ చిత్రహింసకి గురి అవుతుంటే ప్రతీకారం తీర్చుకోవాలని గట్టిగా అనుకున్న క్షణాలు కూడా వున్నాయి.

కానీ ఎప్పటికప్పుడే బాబు ముఖంలోకి చూడగానే, నిష్కల్మష మైన వాడి మాటలు, దేవుడిని గుర్తుకు తెచ్చే ఆ అమాయకత్వం నిండిన పసి తనపు చిరునవ్వు తనెంత దారుణంగా ఆలోచిస్తోంది గుర్తుకు తెచ్చి మరుక్షణములో సిగ్గుతో చితికిపోయేలా చేసేవి. అప్పుడెప్పుడన్నా తనా ఈర్ష్యకి, అసూయకి లొంగిపోయినట్టయితే ఏమయేది? తర్వాత బాబు తనవాడని తెలిస్తే నిజమైన శిక్ష ఎవరు పొందేవాళ్ళు! సంధ్య శరీరం జలదరించింది. ఇన్ని రోజులు బాబెవరో చెప్పకుండా దాచినందుకు మాధవ్‌మీద కోపం వచ్చిందికూడా. తీక్షణమైన సూర్యకాంతి సోకగానే దట్టంగా పట్టినమంచు కరిగిపోయి ప్రకృతి రూపురేఖలు సుస్పష్టంగా కన్పించినట్టు మాధవ్ పట్ల ద్వేషం అంతరించగానే అతని వ్యక్తిత్వం, విశాల హృదయం, మంచితనం, బాగా అర్థం కాసాగాయి. ఒక్కసారి వెనక్కు తిరిగి చూసుకుంటే అతను చేసిన ప్రతిపని వెనక ఒక అర్థం, పలికిన ప్రతిమాట వెనక కొంత బాధ, బలవంతంగా తెచ్చి పెట్టుకున్నసహనం కన్పిస్తున్నాయి. బాబెవరో తెలిసిం తర్వాత యెలాంటి భావం లేకుండా విర్లిప్తంగా వుండటానికి ఎలా సాధ్యం? మారిన మనసుని అతనికి అర్థం అయేలా చెప్పటానికి మాటలెలా దొరుకుతాయి?

సంధ్య మాధవ్ రాకకోసం వేయి కళ్ళతో ఎదురు చూడ సాగింది.

* * *

సిస్టరున్న రెండు వారాలు యిట్టే గడిచిపోయినాయి. ఆవిడ బాబుని సంధ్యని వదిలి వెళ్ళలేక వెళ్ళింది. మాధవ్ రాగానె తనకి తెలియ చేయమని, అతన్ని తను చాలా చాలా అడగాలని అనుకుంటున్నానని చెప్పింది. ఇకనుంచి ప్రతి వేసవిలో యిక్కడికి వచ్చి వారం పదిరోజులు వుండి వెళ్ళమని ఆయా మరీ మరీ చెప్పింది. మాధవ్, సంధ్య కలిసి ఆహ్వానిస్తే తప్పకుండా అలాగే వస్తానని చిరునవ్వుతో సంధ్యవైపు చూస్తూ జవాబు చెప్పింది ఆవిడ.

సిస్టర్ వెళ్ళిపోయి కూడా పదిరోజులు కావస్తోంది. మాధవ్ జాడాజవాబు లేదు. ఏదో వంకపెట్టి గోవిందుని కంపెనీకి పంపి అతను యెక్కడు న్నాడో యెప్పుడు వస్తాడో తెలుసుకోవాలని యెంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. అతను టూర్ మీద వెళ్ళాడని, ప్రస్తుతం ఫలానాచోటున వున్నాడని ఖచ్చితంగా చెప్పలేమని సమాధానం పంపారు వాళ్ళు. రోజులు గడిచినకొద్దీ సంధ్య కెందుకో మనసులో అవ్యక్తమైన దిగులులాంటిది మొదలు సాగింది. ఎంత చిక్కబట్టుకుందామన్నా సాధ్యం గావటం లేదు. అడ్రస్ తెలిస్తే "నాన్నా! యింటికిరా.

బాబు" అనో, లేక "మీ కోసం ఎదురు చూస్తున్నాం. సంధ్య, బాబు" అనో వైర్ యిప్పించ వచ్చు. కనీసం కుతూహలం పట్టలేక అయినా రావచ్చు.

వెళ్ళేరోజు అతను చెప్పనే చెప్పాడు. "చాలాదూరంవెడుతున్నాను. బాబు జాగ్రత్త" అని. కానీ అది ఎంత దూరం? ఆ ప్రయాణం యింకా యెన్నాళ్ళు!

అతనికోసం అంత ఆత్రంగా యెదురు చూస్తున్నా మళ్ళీ మనసులో మారుమూలగా యెక్కడో ఇన్నాళ్ళు తను చూపిన నిర్లక్ష్యాన్ని అతను అంత తేలికగా క్షమిస్తాడా? ఏ కారణం చేత అంత కఠినంగా ప్రవర్తించిందీ అతనికి వివరంగా చెప్పెయ్యాలి. కాని ఎలా చెప్పటం? ఏనాడూ అతనిముందు నిలబడి సూటిగా మాట్లాడటం అంటే ఏమిటో తనకి తెలియదు. ఇప్పుడు ఆ శక్తి వస్తుందా! ఆ సాయంత్రం సంధ్య గదిలో కూర్చుని బాబు షర్ట్ గుండీలు కుడుతూ మాధవ్‌ని గురించి ఆలోచిస్తోంది.

ఇంతలో బైట కారు హారన్ విన్పించింది. సంధ్య వులిక్కి పడింది. కారులోపలికి వచ్చి ఆగిన శబ్దంకూడా విన్పించింది. గదిలో కూర్చుని ఆడుకుంటున్న బాబు 'నాన్నవచ్చాడు-నాన్న వచ్చాడు' అంటూ బైటికి పరుగెత్తాడు. సంధ్య తనుకూడా వెంటనే వెళ్ళటానికి లేచి మళ్ళీ అంతలోనే ఆగి కూర్చుని మామూలుగా కుట్టుకోటానికి ప్రయత్నించ సాగింది. కానీ కుట్టు కుదరటం లేదు. సూదివెళ్ళి వేలిలో దిగింది.

---

# జరిగిన కథ

పుణ్యానికిపోతే పాప మెదురవుతుందట. ఒకానొక భయంకర రాత్రి ఆపదలో చిక్కుకున్న సంధ్య అనే యువతికి సహాయపడబోయిన మాధవ్‌ను ఆమె అపార్థం చేసుకుని, కొట్టి అవమానిస్తుంది. ఆ తర్వాత కొన్నేళ్ళకి ఆమె అతనికి రైల్లో ఒంటరిగా తారసిల్లుతుంది. అతనిలో ఆమెపై పగ పెల్లుబికి ఆమెను మానభంగం చేస్తాడు. మరికొన్నేళ్ళకు ఆ సంధ్యే అతడు నివసిస్తున్న ఊరిలో తటస్థపడుతుంది. తన జీవితంలోకి మళ్ళీ మళ్ళీ ప్రవేశిస్తూ, తనపై విపరీతమైన ద్వేషం చూపుతున్న ఆమెను తనదిగా చేసుకోవాలని యత్నిస్తాడు. కుంటివాడైన ఆమె తమ్ముడు వాసుకు, కాలు నయంచేస్తాడు. తనవల్ల ఆమెకు జన్మించిన కుమారుడు ఎవరివద్దనో పెరుగుతున్నట్టు తెలుసుకుని వాడిని ఇంటికి తీసుకు వస్తాడు. కాని ఆ పిల్లడు తన పుత్రుడేనని సంధ్యకు తెలియదు. సంధ్య మనస్సు మార్చలేనని నిరాశచెంది మాధవ్ ఇంటిలోనుంచి వెళ్ళిపోతాడు. ఆ తర్వాత తన కాన్పు సమయంలో సహాయం చేసిన ఒక సిస్టర్ ద్వారా ఆ పిల్లవాడు తన కొడుకేనని సంధ్యకు తెలుస్తుంది.

---

వేళ్ళ కొనలకి చిరు చెమటలు అలుము తున్నాయి. శరీరంలో రక్తం అంతా ఒక్కసారి ముఖంలోకి పొంగినట్టుగా వుంది. మరుక్షణంలో దగ్గరగా వినిపించ బోయే సుపరిచితమైన స్వరంకోసం ఆదుర్దాగా, ఎదురుచూస్తున్నసమయంలో ఆయా గుమ్మంలోంచి తొంగిచూస్తూ.

'నువ్వొక్కడున్నావా ? ఎవరో వచ్చారు. నువ్వు కావాలని అడుగు తున్నారు' అంది. సంధ్య తలెత్తి చూసింది. చేతిలో షర్టు జారిపోయింది. 'నన్నా !' అంది ఆశ్చర్యంగా. అయితే వచ్చింది మాధవ్ కాదన్నమాట. కాదని ఆయా ముఖం చెబుతూనే వుంది. అబ్బ ! నిరాశ యింత పదునుగా ఉంటుందని కాని, అది యింత నిర్దాక్షిణ్యముగా చీలుస్తుందని కాని సంధ్యకింత వరకూ తెలియదు.

"నిన్నే ! ఈ యింట్లో సంధ్య అంటే యెవరు అని అడుగుతున్నారు. ఆయన కంపెనీ నుంచి వచ్చారుట."

సంధ్య గుండెల్లోకి పొంగుతున్న వేడి రక్తం క్రమేపీ చల్లబడిపోయింది. ఆయా చెప్పిందేమిటో అర్థంకాని దానిలా లేచి హాలులోకి వచ్చింది.

సంధ్య రాగానే అక్కడ నిలబడి వున్న ముగ్గురు మగవాళ్ళు ఒకేసారి నమస్కారం చేశారు. సంధ్య ప్రతి నమస్కారం చేసింది. వాళ్ళలో పంచె లాల్చీతో, కళ్ళద్దాలతో పొట్టిగా వున్నాయన ఒకడుగు ముందుకువేసి 'నా పేరు శ్యామ సుందరం. నేను మీ కంపెనీకి లీగల్ ఎడ్వయిజర్ని" అన్నాడు.

సంధ్య ఆయన చెప్పేదేమిటో కొత్తగా అర్థంగానిదానిలా చూస్తోంది.

"వీళ్ళిద్దరూ మీ భాగస్వాములు." మిగతా యిద్దర్ని పరిచయం చేశాడు.

"కూర్చోండి" అంది.

"మీరుకూడా కూర్చోండి" అన్నాడు లాయరు శ్యామసుందరం.

సంధ్య కూర్చోలేదు. కుర్చీ వెనకాలగా నిలబడింది. వాళ్ళు ముగ్గురూ కూర్చున్నారు. భాగస్వాముల్లో ఒకాయన గుమ్మానికున్న పరదాలు అవీ పరిశీలిస్తున్నాడు.

రెండోఆయన చూపులు నేలకి కరుచుకుని వున్నాయి.

వీళ్ళకి యిక్కడ ఏం పని ? ఎందుకొచ్చినట్టు ? మీ కంపెనీ - మీ భాగస్వాములు అంటారేమిటి ? అప్పుడే అనేక ప్రశ్నలు రా సాగినాయి.

శ్యామసుందరంగారు కళ్ళజోడు తీసుకుని జేబురుమాలుతో తుడుచుకుంటూ, "మీకెలా చెప్పాలో తెలియటంలేదు" అన్నాడు.

"ఏమిటది ?" అంది వెంటనే. సంధ్య అడిగిన తీరు చూడగానే ముగ్గురూ ముఖ ముఖాలు చూసుకుని వూరుకున్నారు.

"చెప్పండి" అంది సంధ్య. వాళ్ళ వాలకం చూస్తుంటే ఏదో చెప్పాలని వచ్చి చెప్పలేనట్టు అవస్థ పడుతున్నట్టుగా వుంది.

"మీరీమధ్య కలకత్తా దగ్గర రైలు ప్రమాదం గురించి పేపర్లో చదివారా?"

సంధ్య చదవలేదన్నట్టు గట్టిగాతలూపింది. అయినా దానికి, వాళ్ళ రాకకి ఏం సంబంధం ? అర్థంకాని అను

మానంతో, భయంతో మనస్సులో సప్త సముద్రాలు పొంగుతున్నాయి.

"అందులో కొద్ది మంది గాయపడ్డారు" వేరులా సన్నగా వున్నాయన అన్నాడు.

"చాలామంది చనిపోయారు. ఈ మధ్య కాలంలో ఎప్పుడూ అంత పెద్ద ప్రమాదం జరగలేదుట." నేలమీదకి గుచ్చి చూస్తున్నాయన తలెత్తుతూ అన్నాడు.

సంధ్య చేతులు ముందున్న కుర్చీని గట్టిగా పట్టుకున్నాయి.

"మాధవ్ అదే ట్రెయిన్‌లో వున్నాడు. ఇదుగో చూడండి. అదే ట్రెయిన్‌కి వస్తున్నట్టు. స్టేషన్‌కి కారు పంపమని యిచ్చిన టెలిగ్రాం" శ్యామసుందరం జేబులోంచి టెలిగ్రాం తీసి ఇచ్చాడు. ఎంతమంది చేతులు దానిమీద పడ్డాయో! నలిగి, చిరగటానికి సిద్ధంగా వుంది.

వణుకుతున్న చేతుల్తో అందుకుని చూసింది. అక్షరాలు సరిగా నిలవటం లేదు. చెవుల్లో సముద్రపు హోరు వినిపిస్తోంది. అది అంతకంతకు ఎక్కువై దగ్గరగా వస్తున్నట్టు అనిపించసాగింది.

"అక్కడకి మేం వెంటనే వెళ్ళి కలకత్తాలో వారున్న హోటల్లో ఎంక్వయిరీ చేశాం. ఆ హోటల్ టాక్సీ అతనే స్వయంగా స్టేషన్ దగ్గర దించి వచ్చానని చెప్పాడు."

"అంటే?" పెదవులు తడారి పోతుండగా అడిగింది సంధ్య.

"యాక్సిడెంటు అయిన వాళ్ళందర్నీ చేర్పించిన హాస్పిటల్ అంతా కూడా వెతికాం. చివరికి ముఖం చితికిపోయి, రెండు చేతులు విరిగిపోయిన ఒక శవం జేబులో యివి దొరికాయి." మరో జేబులోంచి పర్సు కలిసి వున్న చిన్న డైరీ, తాళంచెవులు తీసి మధ్యనున్న టేబుల్ మీద పెడుతూ అన్నాడు.

"ఏమిటి! ఏమిటండీ మీరనేది?" అంతవరకూ లోపలి గుమ్మంలో నిలబడి యిదంతా వింటున్న ఆయా అదుర్దాగా యివతలకి వస్తూ అంది.

"మేం కూడా నమ్మలేకపోయాం. కానీ యివి చూసిన తర్వాత -" శ్యామసుందరం గుటక మింగి వూరుకున్నాడు.

ఆయా ఏడుస్తూ "సంధ్యా" అంటూ దగ్గరగా వెళ్ళబోయింది. అప్పటికే తడుముకుంటున్న దానిలా గోడని పట్టుకుని లోపల గుమ్మంవైపు నడుస్తోంది సంధ్య.

"మీరు ధైర్యం తెచ్చుకోవాలి." వెనకనుంచి శ్యామసుందరం అంటున్నాడు. ఎంతో ప్రయత్నంమీద గుమ్మం దాటగలిగిన సంధ్య ఆ పైన శక్తి లేనట్టు అక్కడే కుప్పలా కూలిపోయింది.

* * *

## 52

ఎంత దురదృష్టం! అన్ని రోజులు అనుక్షణం కళ్ళముందు తిరిగిన మని

షని కనీసం కళ్ళార్తి అయినా చూడలేదు. అతను లేడని తెలిసిం తర్వాత మనసంతా అతని రూపమే నిండిపోయింది. శరీరంలో అణు వణువు అతనే కావాలంటోంది. జీవితంలో అడుగడుక్కీ దుర్విధి ఎందుకిలా వంచిస్తోంది? ఏం పాపం చేసింది తను! కొత్త జీవజ్యోతిని వెలిగించుకోవాలని ఆశించటం ఆలస్యం, ఝంఝామారుతంలాంటి అవాంతరం ఏదో ఒకటి విసురుగా వచ్చి దాన్ని ఆర్పేస్తోంది. మళ్ళీ కళ్ళముందు అంతా చీకటి. ఎప్పటికప్పుడే ఎదురుదెబ్బలు, ఎప్పటికప్పుడే వయసుకి మించిన వైరాగ్యం, ఈసారి తగిలిన యీ దెబ్బనుంచి కోలుకుంటాననే ఆశ ఏ మాత్రం లేదు. ధైర్యం, సహనం పూర్తిగా సడలిపోయినాయి. భూతాన్ని చూసిన చిన్న పిల్లలా జీవితం అంటే బెదురు పుట్టోంది. ఎంత అభాగ్యురాలు కాకపోతే పూర్తిగా అతన్ని పోగొట్టుకునే ముందు అతన్ని గుర్తించటం జరుగుతుంది. శేషజీవితం అంతాఅతన్నిగురించిన జ్ఞాపకాలతో వెర్రిదానిలా బ్రతక మనేగా భగవంతు డిలా శిక్షించింది! సంధ్య కూర్చున్నా, నిలబడినా, యింట్లో యేమూల తిరిగినా అతని రూపమే కన్పిస్తోంది. అతని మాటలే వినిపిస్తున్నాయి. ఆఖరిరోజు అతని ప్రవర్తన బాబుని అప్పగిస్తున్నాననటం. బలవంతంగా తీసుకొచ్చి తన గదిలో అతనే స్వయంగా పడుకోపెట్టటం యివే పదేపదే కళ్ళముందు కన్పిస్తున్నాయి.

అన్నింటికంటె విచిత్రం! మాధవ్‌కి తన మరణం ముందే తెలుసునన్నట్టు విల్లు వ్రాసి పెట్టాడు. అందులో అతని ఆస్తికంతా వారసుడైన బాబుకిసంధ్యని గార్డియన్‌గా నియమించాడు. వాసు చదువు నిమిత్తం కొంత వేరుగా కేటాయించాడు. తన తదనంతరం వాసు బాబుని స్వంత తమ్ముడిలా చూడాలని, పెరిగిపెద్దయినతర్వాత ఏవిషయంలోనూ తనులేని లోటు రానివ్వకుండా కన్నతండ్రిలా చూడాలని ప్రత్యేకంగా కోరాడు. 'సంధ్యని బాబుకి గార్డియన్‌గా నియమించడం కంటే సంధ్య గురించి యింకేమీ లేదు. తనకర్మ కాండల పేరుతో డబ్బు దుబారా చేయకూడదని, రాంగోపాలరావు గారి హాస్పిటల్‌కి తన పేరుమీద కొంత డబ్బు విరాళం మాత్రం యివ్వాలని సూచించాడు. తను బ్రతికున్నంతకాలం బాబు సంరక్షణ చూడవలసిందిగా ఆయాని కోరాడు. ప్రతిఫలంగా ఆయాకి తిండీ, బట్టా బాబు డబ్బులోంచి ఖర్చుపెట్టటమే కాకుండా ఆయా పేరు మీదుగా విడిగా వేయి రూపాయిలు కేటాయించాడు.

వాసు బాబుని కౌగిలించుకుని ఒకటే ఏడుపు. చదువు మానేస్తానని కూర్చున్నాడు. అక్కా, తమ్ముడు ఇద్దరూ వాదించుకున్నారు. చివరికి విసిగిపోయిన సంధ్య "బాబుకేం ఫర్వాలేదు. నేను లేనా? ఆయా లేదా?" అంది కోపంగా.

వాసు మండిపడ్డాడు. "ఉన్నావులే మహా! నువ్వసలు బాబుని ముట్టుకోటానికి కూడా వీల్లేదు. బ్రతికున్నంత

కాలం ఆయన్ని రాక్షసిలా కాల్చుకు తిన్నావు. అంత సాయంచేస్తే ఒక్క చల్లనిమాట మాట్లాడని కృతఘ్నురాలివి. నీ పెంపకంలో బాబుని వదిలేస్తే ఆయన ఆత్మకి శాంతి కూడా వుండదు."

సంధ్యకి ఏడుపుతోపాటు నవ్వు కూడా వచ్చింది "అంతేరా వాసూ? నన్ననటానికి నీకు యింకేమాటలు దొరక లేదా?" అంది.

వాసు మాట్లాడ లేదు. విసురుగా తల తిప్పుకుని కూర్చున్నాడు.

"నువ్వు చదువుకోవటమే ఆయన ముఖ్య ఉద్దేశం" అని సంధ్య మరీ మరీ నొక్కి నచ్చచెప్పటం వల్ల చివరికి వాసు ఎలాగో సగం అయిష్టంగానే [illegible]కు వెళ్ళటానికి ఒప్పుకున్నాడు. వెళ్ళే ముందు బాబు విషయం ఆయాతో వందసార్లు హెచ్చరించి మరీ వెళ్ళాడు.

ధైర్యంగా వుండటానికిగాను సంధ్య కోరికమీద గోవిందు కుటుంబంతో సహా వచ్చి యింట్లోనే వుంటున్నాడు. సంధ్య తనకోసం కట్టించుకున్న యిల్లు హాస్పిటల్ పెట్టటానికి గవర్నమెంట్‌కి ఇచ్చేసింది. ఆయా ఒంట్లో కూడా అంత బాగుండటం లేదు. వార్ధక్యం బాగావచ్చేసింది. మనిషికి రాత్రి పూట చూపు సరిగ్గా తెలియటం లేదు. మాటి మాటికీ ఏదో కారణం కల్పించుకుని ఏడుస్తూ "ఇంకా నే నెందుకు బ్రతికున్నానురా భగవంతుడా! ఇంకా నే నేం చూడాలి? ఈ గుక్కెడు ప్రాణం గుటుక్కుమనటానికి యింకా యెంతకాలం! ఎన్నాళ్ళు నాకీ నరక యాతన" అని తరచుగా అనసాగింది.

సంధ్యకి ఒక్కదానికీ ఏడుపు రావటంలేదు. ఆయా, వాసు మాధవ్‌కోసం దుఃఖిస్తున్నారంటే వాళ్ళకా అధికారం వుంది. అతనికీ, వాళ్ళకి మధ్య ఒక ఆత్మీయత అనే బంధం వుంది. తనకేం వుంది? ఏ అర్హతతో తను అతను లేని లోటు చూసి బాధపడుతుంది? సంధ్య లోలోపల కుమిలిపోసాగింది.

ఈ మధ్య యీ గందరగోళంతో, యీ కంపెనీ వ్యవహారాలతో, యీ లావాదేవీలతో లాయరు శ్యామసుందరం చీటికి మాటికీ వస్తూ పోతూ వుండటం వల్ల బాగా చనువయారు. ఆయన సంధ్య అడక్కుండానే చాలా సహాయం చేశారు. ప్రతిఫలం యివ్వబోతే కూడా పుచ్చుకోలేదు.

"ఇది నా ధర్మం. ఆయన నాకెలాంటి పరిస్థితులలో సహాయం చేశారో మీకు తెలియదు" అన్నారు.

సంధ్య కుతూహలంగా అప్పుడప్పుడు యధాలాపంగా అడిగినట్టు అడిగి అసలుసంగతి అంతా రాబట్టుకుంది.

మొదటినుంచి ఆయన ప్రాక్టీసు అంతంత మాత్రంగా వుండేదిట. ఎనిమండుగురు పిల్లలు, తల్లి, తండ్రి, నలుగురు పెళ్ళిళ్ళు కావల్సిన చెల్లెళ్ళు, ఇద్దరు చదువుకుంటున్న తమ్ముళ్ళు ఇదీ ఆయన సంసారం. పైసా సంపాదన లేదు. ఇంట్లో ఎప్పుడు చూసినా దరిద్ర దేవత తాండవం చేస్తూనేవుంది.

తమ్ముళ్లు చెల్లెళ్ళు సూటి పోటి మాటలు విసురుతుంటే. కన్న పిలలు అర్ధాకలితో పస్తులు పడుకుంటుంటే. కట్టుకున్న యిల్లాలు కంట తడి ఎప్పుడూ తుడిచెయ్యలేనేమో అని భయంతో, అందరి చేత "అసమర్థుడివి" అని అన్పించుకోలేక క్రుంగిపోతూ, చివరికి ఓ రోజు తెగించి విరక్తితో ఆత్మహత్యకు పాలు పడ్డాడు. అదే సమయంలో ఇంకో పది నిముషాల్లో జీవితం అంతం చేసుకోబోయే తుది ఘడియల్లో ఒక స్నేహితుడు ఆదరా, బాదరా పరుగెత్తుకు వచ్చి అర్జెంట్‌గా రమ్మనమని మాధవ దగ్గరకు తీసుకెళ్ళాడు. వ్యాపారరీత్యా చిన్న లిటిగేషన్ అది. మాధవ్ కంపెనీ లీగల్ ఎడ్వయిజర్ విశ్రాంతికోసం నందిహిల్స్ వెళ్ళి అక్కడున్నాడు. అర్జెంట్ మేటర్ సెటిల్ కావాలి. మాధవ్ ఫైలు శ్యామసుందరం గారికియిచ్చాడు. అది మొదలు, తర్వాత మాధవ్ ద్వారానే ఒకళ్ళిద్దరు బాగా డబ్బుం పలుకుబడి గల వ్యాపారస్తులు క్లయింట్సుగా దొరికారు. దాంతో అతని దశ తిరిగింది. ఒకటి రెండు క్లిష్టమైన కేసుల్లో అతను గెలిచాడు. దాంతో బాగా పేరు వచ్చింది. క్లయింట్స్‌కూడా పెరిగారు. ఈ మధ్యే మాధవ్ కంపెనీ లీగల్ ఎడ్వయిజర్ చనిపోవడంతో ఆపనికూడా ఆయనకే వచ్చింది. మొత్తానికి మాధవ్ పరిచయం అతని జీవితంలో ఓ పెద్ద మలుపు. ఆ మలుపు తిరిగిన తర్వాత అతనికి అసలు ఆనాడు ఆత్మహత్య ఎందుకు చేసుకోవాల్సి వచ్చిందో సరిగా ఆలోచించే తీరుబడి లేకుండా పోయింది. ఇదీ ఆయనకధ. ఏదో రకంగా మాధవ్‌ని గురించిన కబుర్లు వినడం యీమధ్య సంధ్యకి బాగా

అలవాటయి పోయింది. అందులోనే శాంతి లభించ సాగింది.

ఆ రోజు —

బాబు నిద్రపోయాడు. ఆయా కూడా పడుకుంది. శీతాకాలం. బాగా చలి వేస్తూండడం వల్ల రాత్రి ఎక్కువ పొద్దు పోకపోయినా అప్పుడే వూరంతా మాటు మణిగింది. సంధ్య పుస్తకం ఒకటి ఒళ్ళో పెట్టుకుని రెండు చేతులూ గడ్డం క్రింద ఆనించుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. కొన్ని రాత్రుల మంచి కళ్ళు నిద్ర అనేది ఎలా వుంటుందీ మర్చిపోయినాయి. గంటల తరబడి అలా శూన్యంలోకిచూస్తూ కూర్చోవా లనిపిస్తుంది. శూన్యం కాక తనకు మిగిలింది ఏమిటి? ఇలాగే యెన్నో రాత్రులు గడుస్తాయి. ఈ ఇంట్లోనే తన జీవితం తెల్లవారుతుంది అనటానికి సందేహం లేదు. బాబు పెరిగి పెద్దవాడవుతాడు. అప్పటికి యీ లోపునే వాడు పిల్లల తండ్రి కూడా అవుతాడు వాళ్ళ మధ్య అశాంతితో అలమటిస్తున్న హృదయానికి బలవంతంగా శాంతంగా వుండమని నేర్పుతూ, మానసికమైన వ్యథ వల్ల అతి త్వరగా వార్ధక్యం పొందిన తను రోజులు లెక్కపెట్టుకుంటూ జీవితం వెళ్ళదీసుకోవాలి. అదే తన భవిష్యత్! అంతకంటే యింకేం వుంటుంది. అబ్బ! ఎంత భయంకరం! భవిష్యత్ ఏమిటో ముందే తెలిసికోవటంలో ఎంత బాధ!

ఎంత నరకం! బుద్బుద ప్రాయమైన యీ జీవితంకోసం ఎందుకింత వెతుకులాట! దేనికోసం యిన్ని రాగద్వేషాలు? ఉన్నన్నాళ్ళూ మనం సుఖించి మనచుట్టూ వున్నవాళ్ళని సుఖపెడ్దామని యెందు కనుకోరు! ద్వేషం, మోసం, ప్రతీకారం, వంచన, అనుమానం ఇవి లేందే మనిషి మనుగడ పరిపూర్ణత్వం చెందదా!

పరధ్యానగా ఆలోచిస్తున్న సంధ్య వాకిట్లో కారు చప్పుడు విన్పించటంతో వులిక్కిపడింది. చెవులు శ్రద్ధగా ఆలకించాయి సందేహం లేదు. తను భ్రమపడ్డానేమో అన్నట్టు అదికూడా ఒక వూహకాదు. నిజంగానే కారు శబ్దం విన్పిస్తోంది. సంధ్య లేచి 'గోవిందూ!' అని పిలుస్తూ వరండాలోకి వచ్చేసరికే కారు యింటిముందుకు వచ్చి ఆగింది.

లాయరు శ్యామసుందరంగారి కారు అది. ఇంత అర్ధరాత్రివేళ ఆయనకి యిక్కడేంపని? చెడుని శంకించబోతూ సంధ్య 'గోవిందూ' అని మరోసారి బిగ్గరగా పిలవబోయింది. పెదవులు తెరుచుకున్నాయి. కానీ శబ్దం రానే లేదు. కారులోంచి దిగుతున్నదిపొట్టిగా, లావుగా వుండే శ్యామసుందరం కాదు. ఎవరో పొడుగ్గా వున్నారు. అక్కడ చెట్ల నీడలు దట్టంగా పడటంవల్లమనిషి ఆకృతి తెలియటం లేదు. మనక మస

కగా వున్న వెన్నెల వెలుగులో కారు లోంచి దిగిన వ్యక్తి డ్రైవర్‌కేదో చెప్పి తల వంచుకుని మెల్లిగా మెట్లెక్కి పైకి వస్తున్నాడు. కొద్దిపాటి వెన్నెల వెలుగు అతనిమీద పడగానే క్రమంగా ఆకారం గుర్తుపట్టిన సంధ్యలో ఒణుకు ప్రారంభమయింది.

పరధ్యాసగా తల వంచుకొని మెట్లెక్కి పైకి వస్తున్న అతను వున్నట్లుండి కెవ్వుమని కేక విన్పించటంతో వులిక్కిపడి చటుక్కున తలెత్తి చూశాడు. వరండాలో స్తంభం ప్రక్కగా క్రీనీడలో నిలబడిన సంధ్యని చూడగానే వెంటనే ఆగిపోతూ "సంధ్యా!" అన్నాడు అస్పష్టంగా.

"మీడు - మీరు -" తను చూస్తున్నది కలో నిజమో తేల్చుకోలేక పెనుగులాడుతున్నట్టుగా అంది.

"సంధ్యా! నేను మాధవ్‌ని. భయపడటం లేదుగా నువ్వు." నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంటున్న అతని మాట పూర్తిచేయనే లేదు. ఈలోపల సంధ్య సుడిగాలిలా దిగివచ్చి అతన్ని పెనవేసుకుపోతూ "మీరేనా! నిజంగా" అంటూ ఏడవడం మొదలుపెట్టింది.

"సంధ్యా!" ఏదో చెప్పటానికి ప్రయత్నించిన అతని కంఠం పెగిలి రాలేదు. చేతులు అనుకోకుండా సంధ్య భుజాలు పట్టుకుని దగ్గరకు లాక్కున్నాయి.



"నిజంగా మీరేనని చెప్పండినాకు." సంధ్య ఏడుస్తూ అతన్ని మరింతగా కరుచుకుపోయింది.

"నిజం సంధ్యా! నేనే! నేను చచ్చిపోలేదు" గుండెలకి హత్తుకుంటూ అన్నాడు. ఆ క్షణంలో ఆ కలయికలో చూస్తుంటే సంధ్యకోసం తను. తన కోసం సంధ్య యుగయుగాలుగా ఎదురుచూసి చివరికి యిప్పుడు హఠాత్తుగా కలుసుకున్నట్టుగా అనుభూతి కలుగుతోంది

కాముహాసన్, దానివెంటనే సంధ్య కెవ్వుమన్న కేక నిద్ర పట్టీపట్టనట్టుగా వున్న ఆయా వినగానే లేచి "సంధ్యా. గోవిందా, ఏమిటర్రా, అది" అని అరుస్తూ పరుగెత్తుకు వచ్చింది ఆయా కేకలకి ప్రక్క గదిలో గుర్రుపెట్టి నిద్ర

పోతున్న గోవిందు కూడా కళ్లు నులుపుకుంటూ లేచి వచ్చాడు.

ఇద్దరూ బైటకి వచ్చేసరికి వరండా దిగువ మెట్టుమీద నిలబడిన మాధవ్ సంధ్యని రెండు భుజాలు పట్టి గట్టిగా కుదుపుతూ వెర్రివాడిలా "సంధ్యా! సంధ్యా!" అంటున్నాడు. అప్పటికే చైతన్యరహితమైన సంధ్య శరీరం వాడిన కలువ కాడలా అతని చేతుల మధ్య వ్రేళ్ళాడిపోసాగింది.

* * *

## 53

సంధ్యకి మళ్ళీ మెలకువ వచ్చేసరికి ప్రక్కన ఆయా తప్ప యింకెవరూ లేరు.

"ఆయా!"— అంటూ సందేహంగా ఆగిపోయింది. ఇంతక్రితం జరిగింది వాస్తవమేనా అన్న అనుమానం కలిగింది.

ఆయా కళ్ళు దూరంగా కుర్చీలో కూర్చున్న మాధవ్ వైపు చూశాయి.

మాధవ్ లేచి సంధ్య మంచం దగ్గరగా వచ్చాడు.

ఆయా ఏదో పని గుర్తుకువచ్చినట్టు మెల్లగా అక్కడనుంచి బైటకి వెళ్ళిపోయింది.

మాధవ్ రెప్పవాల్చకుండా సంధ్య వైపే చూస్తున్నాడు. సంధ్య కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. ఏదో చెప్పాలని పెనుగులాడుతున్నట్టు కొద్దిగా అదురుతున్న పెదవులు సూచిస్తున్నాయి. చీకట్లో తడుముకుంటున్న దానిలా శూన్యంలోకి చెయ్యి జాచింది.

మాధవ్ యిదేం గమనించనట్టు అలాగే నిలబడ్డాడు. అతని ముఖంలో యేలాటి భావంలేదు. దేనికోసమో వెతికినట్టు శూన్యంలో కదిలిన సంధ్య చేయి అతని కళ్ళలో కన్పించిన నిరాసక్తమైన భావంచూసి మెల్లి మెల్లిగా క్రిందకువాలి దుప్పటి అంచుని గట్టిగా పట్టుకుంది.

ఉన్నట్టుండి అతను "భయపడకు. పరిస్థితులు బలవంతంగా యింటికి వచ్చేలా చేశాయి. రెండు రోజులకంటె ఎక్కువ ఉండను. ఇది యీ యింటికి నా ఆఖరిరాక." అన్నాడు.

నీళ్ళు నిండిన సంధ్య కళ్లు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. మరుక్షణంలో ప్రక్కకు తిరిగి దిండులో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. హృదయవిదారకంగా, గుండెలు చీల్చుకుని వస్తున్నట్టున్న ఆ దుఃఖం చూసిన తర్వాత కూడా అతని మనసు కరగలేదు. కొద్దిసేపు అలాగే చూస్తూ నిలబడిపోయి తర్వాత మెల్లిగా అక్కడినుంచి బైటకి వచ్చేశాడు.

మొట్టమొదట సంధ్య ఒక్కసారిగా వచ్చి అలా పెనవేసుకుపోతే తన రహస్యం బైటపడిపోయిందని. తనెవరో సంధ్య గ్రహించేసిందని. అనుకున్నాడు. ఆ ఆశ కన్పించిన ఆనందంతోనే దగ్గరగా వచ్చిన సంధ్యని నిండు హృదయంతో స్వీకరించినట్టు

గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు. స్పృహ తప్పిన సంధ్యని లోపలికి తీసుకువచ్చి మంచం మీద పడుకోపెట్టగానే ఆత్రంగా తన గదిలోకి పరుగెత్తి పాతకాలపు యినప్పెట్టె లోపల అర లాగి చూశాడు. చూస్తూనే నిర్విణ్ణుడయ్యాడు. తను వెళ్ళేటప్పుడు పెట్టిన కాగితాలు పెట్టినట్టుగా ఎక్కడివి అక్కడే వున్నాయి. వాటిని ముట్టుకున్న జాడే లేదు. వెళ్ళేరోజు రాత్రి కూర్చుని తను మొదటినుంచి చివరిదాకా సంధ్య తన జీవితంలో ఎలా ప్రవేశించి ఏ విధంగా ముడిపడి అల్లుకు పోయిందో, చిక్కుపడి పోయిన యీ రెండు జీవితాలని తనెలా సరి చేయలేక పోయాడో వివరిస్తూ సుదీర్ఘంగా వ్రాసి పెట్టిన వుత్తరం, పెట్టినచోటే పదిలంగా వున్నానన్నట్టుగా అతన్నిచూసి వికృతంగా నవ్వింది. మాధవ్ మనసులో క[illegible] ఆనందం ఆ క్షణంలోనే ఆవిరి అయిపోయింది. చచ్చిపోయాడనుకున్న మనిషి మళ్ళీ హఠాత్తుగా సజీవంగా కళ్ళముందు కన్పించటంతో తాత్కాలికంగా కలిగిన సంతోషం అది. అంతకంటే యింకేం లేదు.లేనిది వూహించి, కానిది ఆశించి తర్వాత బాధ పడటం ఎందుకు ? నిజాన్ని నిజంగా ధైర్యంగా స్వీకరించటం మంచిది. అందుకే అతను యింతక్రితం సంధ్య అలా చెయి అందిస్తున్నా అందుకోలేదు.

మాధవ్‌ని చూడగానే ఆయాకి ఎక్కడలేని ఓపికా వచ్చింది. అప్పటి కప్పుడు మళ్ళీ వంట చేసి అతని స్నానం కోసం నీళ్ళని సిద్ధం చేసింది. సంధ్య ఎలాగో ఏడుపు నిగ్రహించుకుని పనిలో సాయం రాబోతే వద్దని వారించింది.



## పోటీదార్లకు మనవి

"జ్యోతి" మాసపత్రిక కళాశాలల, విశ్వవిద్యాలయాల విద్యార్థినీ విద్యార్థుల నిమిత్తం "చిన్న చిన్న కథల పోటీ" నిర్వహిస్తున్నది. దీని లో పాల్గొనేవారు ఈ క్రింది నిబంధనలు పాటించ గోరుతున్నాము.

1. కథలు "జ్యోతి"లో రెండు మూడు పేజీలకు మించరాదు.

2. స్వకపోల కల్పితమైనస్వతంత్ర రచనలే పంపించాలి.

3. తమ పూర్తిపేరు, చదువుతున్న తరగతి, కాలేజీ, లేక విశ్వవిద్యాలయం పేరుతో సహా పూర్తి చిరునామా జత పరచాలి.

4. ప్రతినెల 1వతేదీ వరకు అందిన రచనలనే ఆ పైనెల సంచికలో పోటీకి పరిగణిస్తాము.

5. బహుమతి పొందని రచనలు త్రిప్పి పంపబడవు. అందుచేత స్టాంపులు పంపించ నవసరం లేదు. రచనల విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

6. కవరు మీద "జ్యోతి, చిన్న చిన్న కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.

7. రచనలను పంపవలసిన చిరునామా: ఎడిటర్, "జ్యోతి" సచిత్ర మాసపత్రిక, విజయవాడ-2."

8. రూ. 50లు ప్రథమ బహుమతి. రూ. 25 లు చొప్పున రెండు ద్వితీయ బహుమతులు.

ఫోంచేస్తూ మాధవ్ ఏదేదో చెబుతున్నాడు. వంటయింటి గడికి యివతలగా నిలబడిన సంధ్యకి పూర్తిగా అన్ని మాటలూవిన్పించలేదు. క్రెయిన్ యాక్సిడెంట్, దానికి ముందు ఎవరో తన డైరీ కొట్టేయటం, వెంటనే రైలు ప్రమాదం. ఏమిటేమిటో అంత స్పష్టంగా విన్పించటం లేదు. ఆయా గుచ్చిగుచ్చి అడుగుతున్న దానికి అతను పొడి పొడిగా రెండు ముక్కలతో సమాధానాలు యిస్తున్నాడు.

భోజనంఅయిపోయింది. లేచి చెయి కడుక్కుంటూ అంటున్నాడు. "ఆయా! రెండే రోజులు వుంటాను. ఈ రెండు రోజుల్లో నీచేతి కమ్మదనం అంతా నాకు రుచి చూపించు. ఈసారి వెడితే యిక తిరిగి రావటం యిప్పుడప్పుడే పడదు."

సంధ్య గుండెల్నిఎవరో పిడికిలితో బిగించి నట్టయింది. ఆయా సమాధానం చెప్పలేదు. అతను టవల్‌తో చెయి తుడుచుకుంటూ యివతలకి వచ్చేసరికి సంధ్య వక్కపొడి తీసుకెళ్ళియిచ్చింది. క్రీనీడ అతని ముఖంమీద పడటం వల్ల ముఖంలో ఎలాటిభావంవుందో సంధ్యకి తెలియలేదు.

వక్కపొడి తీసుకుని సంధ్యవైపు సరిగ్గా చూడకుండానే తన గదిలోకి వెళ్ళిపోయాడు.

## 54

"బాబుని తీసుకెళ్ళి ఆయన గదిలో నేను పడుకోబెట్టిరానా ? నువ్వు తీసుకు వెడ్తావా ?" మంచంమీద కూర్చుని పడుకోబోతూ అడిగింది ఆయా.

"నువ్వే తీసుకువెళ్ళు." విసురుగా అంది సంధ్య.

ఆయా సంధ్య వైపు అర్థయుక్తంగా చూసి లేవబోయింది.

"వద్దులే. పోన్లే! పడుకో బోతున్నావుగా పడుకో." సంధ్య వారిస్తూ తనే వెళ్ళి బాబుని తీసుకుని భుజాన వేసుకుంది.

సంధ్య బాబుని తీసుకుని గదిలో అడుగు పెట్టేసరికి మాధవ్ టేబిల్ ముందు నిలబడి లాంతరు దగ్గర ఏవో కాగితాలు పరీక్షగా చూస్తున్నాడు. సంధ్య లోపలికి రాగానే వెంటనే వాటిని మడిచి కిటికీ దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. ఈ మధ్య వూహాలో అతన్ని చూసి చూసి అలిసి పోయిన సంధ్యకి యిప్పుడు సజీవంగా కదులుతున్న ఆ మూర్తిని పదే పదే కళ్ళారా మరీ మరీ చూడా లనిపిస్తోంది. ఎన్నెన్నో అడగాలని ఆత్రంగా కూడా వుంది. కాని అతనిలో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్న ఆ ముభావం. ఆగాంభీర్యం జంకుని కలి గించి దూరంగా వుండ మన్నట్టు హెచ్చ రిస్తున్నాయి.

బాబుని పడుకోపెట్టి దుప్పటి అంచులు సరిచేస్తూ కావాలని కొద్దిగా జాప్యం చేసింది. అత నేదయినా మాట్లాడ్తాడేమో నని ఆశించింది. కానీ విరాశే ఎదురైంది. అతనసలు వెనక్కి తిరిగి చూడనైనా చూడలేదు. సంధ్య వునికినే గమనించనట్టు కిటికీ దగ్గరగా నిలబడ్డాడు. చేతులో అంత వరకూ పట్టుకున్న కాగితాలు చింపి, నలిపి వుండలు చేసి కిటికీ లోంచి దూరంగా విసిరేశాడు.

"మీకు యింకేమైనా కావాలా?" ప్రాణం చిక్కబట్టుకుని అడగలేక అడిగింది.

"ఉహూ." ఖచ్చితంగా వెంటనే వచ్చింది సమాధానం. అతను పర ధ్యానంగా వుండి గుర్తించలేదో, లేక అలసటతో అర్థం చేసుకోలేక పోయాడో! ఏ మాత్రం శ్రద్ధకనపరిచినా సంధ్య అడిగే తీరులో ఆరాటం, దానిలో ప్రత్యేకత తప్పక గ్రహించ గలిగేవాడు.

సంధ్య వెళ్ళిపోటానికి గుమ్మం వైపు తిరిగింది. అతని ధోరణికి నిరాశ చెందిన మనసు బలవంతంగా మెడ పట్టి గుమ్మం వైపు నడిపించింది. కాని మనసులో అతనిపట్ల వుప్పొంగు తున్న వినూత్నమైన ఈ భావాన్ని నిగ్రహించుకోటానికిశక్తి చాలటంలేదు. అది బైటపడకుండా నిర్లిప్తంగా ప్రవ ర్తించాలంటే ఎంత ప్రయత్నించినా సాధ్యం కావటంలేదు. అందులో అతను రెండు రోజులకంటే. యెక్కువ వుండననటం, ఇక తిరిగి రాననటం యింకా భయపెడుతున్నాయి. పోన్లే! రేపు లేదా? ఎల్లుండిరాదా? అసలే ప్రయాణపు అలసటతో వున్న అతన్ని విసిగించటం దేనికి? క్షేమంగా తిరిగి వచ్చాడు. అంతేచాలు. ఇప్పటికి ఆ తృప్తి చాలు. ఎదురు తిరుగుతున్న మనసుని బలవంతంగా బుజ్జగించి సమా ధాన పరచబోయింది.

(సశేషం)

# నేను... నేడు...

## రామమోహన్‌తో ప్రత్యేక గోష్ఠి




నేటి చిత్రాలు - ప్రేక్షకుల మనస్తత్వాలు - వీటిపై సాధారణంగా ఎవ్వరూ ప్రకటించని అభిప్రాయాన్ని రామమోహన్ ప్రకటించారు.



సాధారణంగా నిర్మాతలు, దర్శకులు ఇతర పెద్దలు ఏదైనా ఇతివృత్తం గురించి, పాత్రరీతి గురించి చర్చించేటప్పుడు "అబ్బో, అది మన ప్రేక్షకులకు టూ మచ్" అంటూ ఉంటారు. "మన ప్రేక్షకులు ఇంకా ఆ స్థాయికి రాలేదు" అనడం కద్దు. "మనకున్న కొద్ది "ఏ" క్లాస్ సెంటర్‌లలో చదువుకొన్నవాళ్లు చూసేస్తే మిగతాదంతా రిస్కే" అని విచారించడం అడపా దడపా జరుగుతూ ఉంటుంది.

కాని రామమోహన్ ఉద్దేశంలో మన కంటే ప్రేక్షకులు తెలివైనవారు. సీను ప్రారంభమయ్యేటప్పటికే ఎలా ముగుస్తుందో వారు ఊహించ గలుగుతున్నారని, డైలాగులు సయితం ఊహించ గలుగుతున్నారని, ఏ పాత్ర ఎలా ప్రారంభమైతే ఎలా ముగుస్తుందో ముందే తెలుసుకుంటున్నారని, అంచేత వారితో "డీల్" చేసేటప్పుడు మనం బాగా ఒళ్ళు దగ్గరపెట్టుకోవా లన్నారు.

ప్రేక్షకులు ఊహించని మలుపులు, మాటలు, చేతలు ఉంచేనే ఆ సీను, ఆ తారలు, ఆ చిత్రం బ్రతికిన ట్లన్నారు.

అయితే సాదా చిత్రాలు కూడా ఆర్థికంగా విజయం పొందుతున్నాయేం? అని అడిగితే విదేశాలలో వలె కాక ఇక్కడ అన్ని తరగతులవారికీ, అన్ని వయసుల వారికీ, స్త్రీలకు, పురుషులకు కాలక్షేపం

ఇచ్చేది సినిమా ఒక్కటే అని,అంచేత జనం విధిలేక విధి ఇస్తున్నారని, ఎగతాళి చేస్తూనే ఎగబడి చూస్తున్నారని రామమోహన్ చెప్పారు.

ఇంకేం? నిర్మాత పర్పస్, స్టార్ లక్ష్యం నెరవేరినట్లే కదా? అని వ్యాఖ్యానిస్తే ఈ స్టార్, డి. బి. ఎన్. "ప్రయివేట్ మాస్టార్ స్టార్," మాస్టార్‌లా ఓ పాఠం చెప్పారు.

ఆయన మనశ్శుద్ధితో అన్న మాటలకు బలం లేకపోలేదు. ఆ మాటల ముందు వెనకలుగా మద్రాసు జ్యోతి ప్రతినిధి అయిన నాకు, మూవీ 'మోహన'కు జరిగిన సంభాషణ సరళి ఇది:

నేను : నిన్న వచ్చిన మీరు, రేపు వచ్చే తారలకు నేడు ఇచ్చే సలహా ఏమిటి ?

రామమోహన్ : నేడు, రేపు భద్రం కావాలి అంటే కొత్త తారలకు వరస వరసన నాలుగైదు పిక్చర్స్ మూడు నాలుగేళ్ళలో తగలాలి.

ప్రశ్న : ఎందుకని ?

జవాబు : కొత్తనటుడు కొత్త వాతావరణానికి అలవాటుపడి, మూడు నాలు పాత్రలలో పరిచయమై, తన అభిరుచికి తగిన భూమికను ధరించినప్పుడు కాని, 'రేపు' అనేది ఖాయం కాదు.

ప్ర : సమర్థుడైతే ఒక్క చిత్రం, ఒక్క సంవత్సరం చాలదా ?

జ : ప్రస్తుత పరిస్థితులలో చాలదు. కొత్త తార కోరే భూమిక, తార కోరిన విధంగా దొరుకుతుందనే గ్యారంటీ ఏది ?

ప్ర : శివాజి గణేశన్ 'పరాశక్తి'తో 'వరూధిని' మరచిపోతే "షావుకారు"తో రంగారావు ఒక్క చిత్రంతో,ఒక్క సంవత్సరంతో పైకి రాలేదా ?

జ : ఇక్కడేమిటి ? బొంబాయిలో అయినా మీ జాబితా అంతటితో ఆగవలసిందే !

ప్ర : .... ....

జ : ఆ కాలంలో ప్రేక్షకులకు సినిమా విషయాలు గురించి ముఖ్యంగా సాంకేతిక విషయాల గురించి చాలా కొద్దిగా తెలుసు. తెరపై మనం చూప గలిగింది వారు స్వీకరించ గలిగారు.

ప్ర : ఇప్పుడూ ?

జ : ఇప్పుడు మన మేది ఇస్తే అది మింగే స్థితిలో ప్రేక్షకులు లేరు.సాంకేతిక విషయాల గురించి వారు మాట్లాడేసున్నారు.డైరకన్, ఎడిటింగ్ మొదలైనవే మాట్లాడేస్తున్నారు. సంభాషణలలో, నటనలో, క్యారక్టరైజేషన్‌లో తప్పులు పట్టేస్తున్నారు. అంచేత ఈ రోజుల్లో కొత్తవాడు హీరోవర్షిప్ పొందాలి అంటే తన నటనలోనే కాదు మరే ఇతర సాంకేతిక విషయంలోనూ లోటు రాకూడదు.

ప్ర : మీ లెక్కన ఈ తరం వారి తర్వాత నిజమైన స్టార్ అంటూ వుండబోరన్నమాట.

జ : ఆ మాట నేననడంలేదు. కొత్తవారు వచ్చినప్పుడు వారికి నేడేకాక రేపుకూడా చూపాలి అంటే నిర్మాతలు అదనపు భారం వహించక తప్పదు.



హరిహరన్ పిక్చర్స్‌వారి "ఆమె ఎవరు ?"లో

జయలలిత, జగ్గయ్య

ప్ర: ఏమిటది ?

జ: స్టార్ హోదా సంగతి దేవుడెరుగు, ముందు కొత్తతార ప్రేక్షకులలో స్థిరపడే వరకయినా వసతి చూపాలి.

ప్ర: ఎలా ?

జ: సీను ప్రారంభమయ్యేటప్పుడే ఎలా ముగుస్తుందో నేటి ప్రేక్షకులు ఊహించ కలుగుతున్నారు. పాత్రలు కల్పించినప్పుడే ఎలా నిష్క్రమిస్తాయో తెలుసుకొనగలుగుతున్నారు. అటువంటప్పుడు ఏ కొత్త తార అంత సులభంగా ప్రేక్షకులలో స్థిరపడదు

ప్ర: పోనీ, కష్టంగా అయినా స్థిరపడేందుకు మార్గమేమిటి ?

జ: ఒక్క పిక్చర్‌తోటే కొత్త నటుడు "మైహోమ్" అనే స్థితికి రాకుండా నాలుగు కాలాలపాటు మూవయే అతని హోమ్ అయ్యేందుకు వరుసగా మూడునాలుగు సంవత్సరాలు నాలుగైదు పిక్చర్లు ఉండే పరిస్థితి కలిగించాలి.

ప్ర: ఎవరు ? ఎలా కలిగించాలి?

జ: ఎవరు అన్నది అయా పరి

స్తూలపై ఆధారపడి వుంటుంది. ఎలా అంటే కొత్తవారిని నాలుగైదు రకాల పాత్రలలో త్రిప్పి ప్రేక్షకులకు అలవాటయ్యేటట్లు చెయ్యొచ్చు లేదా ఒకటిరెండు చిత్రాలయ్యాక కొత్తవాతావరణానికి అలవాటు పడతారు కాబట్టి వారి ప్రత్యేకాభిరుచి ఏమిటో సానుభూతితో తెలుసుకొని తెగించి అటువంటి భూమిక మలచాలి, ఇవ్వాలి.

ప్ర చాలా ?

జ • స్క్రీన్ ప్లేలో ప్రేక్షకులు ఊహించేది వీకైనంత వరకు రాకుండా చెయ్యడం అన్నింటికంటె అవసరం

ప్ర • అయితే మంచిభూమిక వస్తే చాలా ? మంచి డైరక్టర్ లభిస్తేచాలా ?

జ • రెండూను

ప్ర మీరు ఒక్కటే చెప్పాలి.

జ • పాత్రనుంచి దర్శకుని వేరు చేయలేము. ఆ మాటకువస్తే చిత్రాన్నీ దర్శకుని నుంచి వేరు చెయ్యలేము చిత్రానికి గురువు సచివుడు దైవము దర్శకుడు ఆ దేవుడు కొత్త తారలకు వారి అభిరుచి, ఆసక్తి శక్తి యుక్తి ముమ్మూర్తులా వికసించే భూమిక యిస్తే చాలు

ప్ర • రేపు భద్రం అంటారు ।

జ • రేపే కాదు. రామమోహనే కాదు ఏ కొత్త తారలకైనా భవిష్యత్తు భద్రం

ప్ర మీ భవిష్యత్తు భద్రమనుకొంటున్నారా ?

జ తప్పకుండా

ప్ర • అయితే మీకు నూటికి నూరుపాళ్ళు నచ్చేభూమిక రావలసింది ఏమీ లేదంటారు ?

జ ఉంది ఏ రకం భూమికనైనా నిర్వహించ కలిగినవాడే నటుడు. కాని

ప్ర • ఏమా కుంజరః ।

జ నాకు ఒక రకం భూమికపై మక్కువ ఎక్కువ.

ప్ర • ఏమిటి ? ఏమా కథ ?

జ బరువైన భూమికలు ప్రేక్షకులలో కలకాలం నిలుస్తాయి.

ప్ర అయితే శోకం, శోకాంతం. శాక్రిఫైస్ ఈ మోహనుడి మోహమన్నమాట

జ • మీరన్నది సొంతం రైటుకాదు. ఆత్మ బలిదానం చెయ్యకపోయినా, త్యాగం చెయ్యకపోయినా బరువు బాధ్యతలు నిర్వహించవచ్చు. బాధపడవచ్చు వ్యథ చెందవచ్చు మానసిక సంఘర్షణలతో కుమిలిపోవచ్చు. భగ్న ప్రేమికుడు కావచ్చు గుడ్డివాడు కావచ్చు అంగవిహీనుడు కావచ్చు. తను బాధపడుతూ. ప్రేక్షకులను బాధించి మెప్పు పొందగల నటుడు ధన్యుడు.

ప్ర • ఇతర భూమికలు 'జనంలో మనం' చెయ్యనివ్వవంటారు.

జ • ఈ భూమికలు చేశాయని. చేస్తాయనీ మాత్రం ఘంటాపథంగా చెప్పగలను బహువిధ భూమికలను ధరించడం నటునిగా నా విధి అయినప్పటికీ బరువుభూమిక ధరించినప్పుడే



శ్రీరంగా అండ్ చిత్రాంజలివారి "శ్రీకృష్ణ మహిమలో"
కాంతారావు, సి యస్. ఆర్

రెండింతల రామమోహన్ కన్పించగల డని గట్టిగా చెప్పగలను

ప్ర : అయితే మీకు తెరపై రెండింతలు కన్పించిన తార లున్నారా ?

జ : ఉన్నారు, ఉన్నారు

ప్ర : ఎవరు వారు ? ఏమా కథ ?

జ : చాలా కథలలో గ్రెగరీ పెక్, దేవ్ ఆనంద్, మీనాకుమారి

## నేడు

నేడు రామమోహన్ బి. ఎన్. రెడ్డి "రంగుల రాట్నం" లో లాయర్ సూర్యంగా నటిస్తున్నారు. మధ్యతరగతి లోనే దిగువ పౌర అంకు చెందిన సూర్యం అనుక్షణం ఆశించేంది ఆర్థిక సాంఘిక అగ్రస్థానాలు తత్ఫలితంగా భార్య ఒక భారం తెచ్చింది తల్లిపై ఒక భారం పడింది. తమ్ముడు వరొక భారం తెచ్చాడు దగ్గరివారు పూలమాలతో ఉరి వేస్తున్నారు. సూర్యం ఏమౌతాడు ? "రంగుల రాట్నం"లో రామమోహన్ భూమిక అనేకమైన హంగులు రంగరించుకొని వుంది.

# కొత్తనటుడు చంద్రమోహన్

వ్యాయామంలో పరిశ్రమ చేసిన వారికి వెండితెర ఈమధ్య వెలుగు చూపుతున్నది.

వ్యవసాయ పట్టభద్రుడై వెయిట్ లిఫ్టింగ్, జిమ్నాస్టిక్స్, గేమ్సులో విశేషాభిలాషచూపిన మల్లంపల్లి చంద్రశేఖరరావుకు బి. ఎన్. రెడ్డి ఆ రూపానికి తగిన భూమికను "రంగుల రాట్నం"లో నిర్ణయించారు. ఈ భూమిక అంతా విజయవాడ చుట్టూ తిరుగుతుంది, ఎమ్యూజ్‌మెంట్ పార్కు మొదలైనవన్నీ ఉంటాయి. బి. ఎన్. ఈ 24 సంవత్సరాల బలిష్ఠునికి పెట్టిన కొత్త పేరు చంద్రమోహన్.

సినిమాలో చిన్న తమ్ముడు. పైకి రౌడీగా కన్పించినా లోపల మెత్తని మనసు. అదే అమ్మతో పోరుతెచ్చింది. అన్నతో యుద్ధానికి దించింది. సోదరి వివాహంకోసం ఎందరితోటో తగవు తప్పలేదు. రౌడీగా కన్పించే ఈ మనిషి చెల్లెలు పెళ్ళికని రూ. 50 వేలు పుట్టించాడు. ఎలా ?

అనుక్షణం తనలోని మంచికి, తన పైన కన్పించే చెడుకు మధ్య నలిగిన చిన్న తమ్ముని భూమికను ఈ కొత్త నాటకాలనటుడు సంతృప్తికరంగా నటించినట్లు భావిస్తున్నారు. కళాశాలల్లో హీరోగా, వృద్ధునిగా, కమెడియన్‌గా నటించారు. తీరా సినిమాకు వస్తే లభించింది కరకు యువకుని భూమిక.

నటుడన్నాక ఏ పరీక్షకైనా నిలవాలని ఈ వ్యాయామ యువకుడు అంటారు.

చంద్రమోహన్‌కు సంబంధించి నంతవరకు ఇంకొక మూడు ఘట్టాలు చిత్రీకరించవలసి వున్నవి. ఒకటి వాణిశ్రీతో నృత్య గేయం. రెండు : రెండురకాల కుస్తీ పోటీలు.

23 మే 1942 లో జన్మించి బాపట్ల వ్యవసాయ కళాశాలలో పట్టభద్రుడై ఏలూరులో హార్టికల్చర్ అసిస్టెంట్‌గా మూడేళ్ళు పనిచేసిన చంద్రమోహన్ అలనాటి చంద్రమోహన్ స్థాయిని అందుకోడమే పరమలక్ష్యంగా పెట్టుకొన్నారు.

